# భారతి

[ సచిత్ర మాసపత్రిక ]

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్





ఆంధ్రపత్రికా ముద్రాలయము

మదరాసు.

సంపుటము 20] జూలై, 1943 [సంచిక 7

విడిప్రతి వెల 8 అణాలు.



# విషయానుక్రమణిక

జూలై, 1943

# భారతి – వింశతితమ సంపుటము. భా–౨

## వ్యాసముల అకారాది సూచి

---



సంపుటము 20
సంచిక 7

భారతి

స్వభాను ఆషాఢము
1943 జూలై

# కవి : రవి*

= కవికోకిల శ్రీ దువ్వూరి రామిరెడ్డి =

కను లటు లెత్తి నే గిటికికమ్ముల సందుల జూడఁ, దూర్పుకొం
డను నవమోహనాంబుద పటంబులపై లిఖియించికొన్న నూ
తనజలవర్ణచిత్రముల దర్శనశాల నమర్చి, చూడరం
డనుచు రసజ్ఞులం బిలుచు నర్కుఁడు రమ్యపికార్భటీ మిషన్.

కరుణాపాత్రుఁడ వీవు భాస్కరుఁడ, యొక్కండుం ద్వదీయార్ద్ర క
ర్బుర వర్ణాంకిత చిత్రశిల్పముల సొంపుల్ నిల్పి వీక్షింపఁ; డం
బరమార్గంబున గ్రుంకు మెట్టపయికిన్ మార్పించు నీశాల; న
గ్గిరి నేయత్నుఁడొ యేవరూథినియొ కాంక్షించుం గళాస్రష్టలన్.

అనుదినముం బ్రదోషసమయంబున బ్రొద్దున వేయిచేతులం
బనిగొని వర్ణవర్తికలు వ్యర్థముగా క్షణభిన్నరూప క
ల్పనల నలౌకికాకృతుల బంకజమిత్ర, యథోచితంబుగం
బొనరిచి నీ యపూర్వకళపోడిమి జుల్కన సేయ బాడియే?

అడుగకమున్న లభ్యమగునద్ది యమూల్యమె యయ్యు దానినిం
బొడగనినన్ నిరాదరము పుట్టక తప్పదు; చిత్రశాల పె
న్నడిగొనునాళ్ల మూయుము; గనంబడు నక్కర, లేనినాడు; ని
మ్మడియగు ప్రేమయున్ విరహమధ్యమయేని స్వభావసిద్ధమై.—

---

* రచన : ౫-౧౧-౧౯౪౧.

అని వచియింప నేను, రుచిరారుణమూర్తి పసిండి క్రాగుమూ
వను బురణింప బేశల లసన్మృదుహాసముతోడ బల్కె నో
మనుజుడ, స్వార్థతత్పరుల మానస మెప్పుడు లాభకాంక్షతో
బెనగొను; త్యాగజీవనము విస్మృతమయ్యె ధరాతలంబునన్.

మనుజున కింత గర్వ! మొక మర్త్యుడ వీవు; అనంతసృష్టి నీ
మనుగడ నీవు నెంత? అణుమాత్రము బోల; నమేయతారకా
గణభరితాంబరంబున కఖండ జగత్తున కేను చక్రవ
ర్తిని; గ్రహముల్ నిరంతర పరిభ్రమణంబున నన్ను గొల్చెడున్.

నేను లేకున్న భువన మంధీకృతంబు;- చేతన ప్రపంచమునకు జేటుమూడు;
చంద్రుడాది గ్రహంబులు సరణిదప్పు;- ఇరుసువిరిగిన బండినా నొరగు జగతి.

ఈయనంతసృష్టికి మోద మెసగజేయ - వ్రాయుచున్నాడ నాలేఖ్యపటము లెపుడు;
కౌతుకముగూర్చు నిష్కామకర్మ నాది; - అట్టి నాకు నీకనికర మవసరంబె?

చీకటిరేయి గొండపయి జేరి యొకండ వగణ్యతారకా
నీకము వ్రేలు శాంతమగు నింగిని జూడుము, నిన్ను జూచుకొ
మ్మొకవి, నీయణుత్వ మటు నూహకు దట్టు; ననంతరంబు గ
ర్వాకులచిత్తవృత్తి కిసుమంతయు గారణ ముండ దెన్నడున్.

నీటిపురువులు చేపలు నిఖిలజలచ - రంబులును జెట్టుచేమలు ప్రబలఖేచ
రములు మృగములు సృష్టిరై ప్రాతపడిన-పిదప మనుజుండు పొడసూపె బృథ్వియందు.

జలజహితుండు ఈగతి బ్రసంగవశంబున బల్క గోపసం
జ్వలనము రేగి మానవయశంబె తృణీకృతమైనయట్లు లో
దలచి యిటంటి : నీకు నిది ధర్మమె మా నరజాతియున్నతిన్
మలినపడంగ దూరెదవు ; మానవు డాద్యుడు గాడె జీవులన్ ?

తిరుపతికొండ నెక్కి పురిదిక్కున జూచిన గ్రింది గుళ్లు గో
పురములు బొమ్మరిండ్లటు లపూర్వనవాకృతి దోచు ; మింటిపై
నిరతము సంచరించుటను నీ కగపట్టు హిమాలయం బిలం
బరిచిన మల్లుదుప్పటముభంగి ; మనుష్యుల మాట చెప్పనా !

సత్యమా, గ్రహనక్షత్రచక్రమునకు - అక్షదండంబ నౌట రోయరుణకిరణ ;
అయినను గాలిచెండంత యగ్నిగోళ - మటుల గన్పింతు వీవు మాయక్షులకును

కేతుగ్రస్తుఁడ వౌదువు ; - పాతరలాడెదవు మింట బరతంత్రుఁడవై ;
నీతున రుజకుం జిక్కెదు ; - యాతాయాతశ్రమార్తి నడలెద వెపుడున్.

గురిగింజసామెతయ్యెను - నరసృష్టినిఁగూర్చి నీవు నాకు వచింపన్ ;
సరి ! శిల్పి వగుటకంటెను - చరితాధ్యాపకుఁడ వౌట చక్కఁగ నుండున్.

మనసున కజీర్తి హెచ్చిన దినమునందు - వెర్రికలల చిత్రంబుల వేయు కార !
నీకును రవీంద్రసత్కవి నేర్పినాఁడొ? - లేక నేర్చెనొ నీ చిత్రలేఖనంబు?

నా పలుకులు విని సూర్యుఁడు - కోపము రానీక లోన గొందలపడకే,
పాపము! కుర్రఁడు నజ్ఞుఁడు - తాపమునకు దగడటన్న తలపు దొలంకన్.

ముసిముసినవ్వు దొంతరలు మోమున, గన్నుల నెల్లిదంబునుం
గసిమసగంగ నాపయి నొకానొక హేయపు జూపు వైచి, మా
నిసుల సమస్తతత్త్వమును నీవలనం గనుగొంటి నోయి, వె
క్కసమును బ్రీతి మెప్పు నుడికారము నిందయు మారు, గాలికిన్.

క్షణమునకుమున్న నా శిల్పకౌశలంబు - పొగడి మెచ్చితి వింతలో దెగడు టేల ?
మూఢభక్తులు సత్యంబు ముట్టలేరు - మనసు ఊసరవిల్లి మీ మానవులకు.

నన్ను వేపించదలచెనో, కన్నుగుట్టి - వేడ్కఁజూడంగ వలచెనో వెర్రితరణి,
కొరవికట్టెను ఎదలోన గులికినట్లు - హాత్యసేయంగ బోయినయట్లు పలికె.

కట్టకడసృష్టి నరుఁ డన్న గనలనేల? - యింక నొక సత్యసూక్తిని ఎరుగుమోయి,
వేనవేలేండ్లక్రిందట విపినచరము-లైన కోతుల సంతతి యవని జనము.

శీతవాతోష్ణములు మార్పుచెందు కతన - బ్రకృతి సర్వంబు కాలానుబద్ధసరణి
మనము కనరానియటు రూపుమారుచుండు; - అట్టి పరిణామఫలమె నీయట్టి నరుఁడు.

తలుపుగుబ్బకు మోచేయి తట్టుకొనగ - గనులు పచ్చగ బోయెడి కరణి దోవ
పిడు గడచినట్టు లీ మాట వినినయంత - గొంతసేపు నిశ్చేష్టత గూరుచుంటి.

మతి యొకయింత తెప్పిరిలి మాంద్యము వాయ, నెడంద యగ్నిప
ర్వతశిఖరంబునా బొగలువారుచు మంటలుగ్రక్క, సూర్యుడున్
వెత యిసుమంత లేక నను వింతగ జూచి హసింప, బెట్టురోల్
స్రుతిశిఖపైన జారినటు రోషము తాపము మల్లడింపగన్.

ఇను డనియును ఘను డనియును - దినమణి యని సర్వసాక్షి దేవుం డని నా
మనమున దలపక మానవ - ఘనతర్ నిలబెట్ట బలుకగడగితి నిటులర్.

గౌరవ మిచ్చి పుచ్చుకొనగావలెగాని యదెంత మీకు మా
వారు ఋణస్థులైన నొకపాటి ప్రియంబును జూప కిట్టి న్య
క్కారము లాడి మాయశము గార్కొనజేయుదె ? తిన్నయింటి కం
గారముగోల్పు నీచుడవు; గాములరే డెటు లైతొ వింతయా.

నీకుశలంబు పెంపొదవ నిత్యము సంజ త్రివర్ణపూరుషుల్
ప్రాకటభక్తి మ్రొక్కెదరు ; భవ్యుడ వంచును విష్ణువంచు స
త్యాకృతి వంచు వేదబుషు లంచితరీతి నుతించుచెల్ల ని
న్నాకమలాప్త! దాని కివి యానె కృతజ్ఞతచూపు మార్గముల్ ?

బురదంబడ్డ చిరత్నరత్నమునకుం బోబోదు మూల్యంబు; ని
ష్కారుణావృత్తి సమస్తమానవమహాసంఘంబు దూషించినం
దరుగంబోదు తదీయగౌరవము; నీదౌష్ట్యంబు లోకంబునర్
స్థిరమాకంబె మరేమి లాభములు సిద్ధించుర్ మృషావాఙ్నిధీ?

నిన్నును నన్నును లోకము-లన్నియు సృజియించినట్టి యంబుజనాభుం
డిన్నరరూపము నొందిన - సన్నమె నీ కెరుకపడని సంగతి దోచుర్.

ధర్మ మడుగంటి దుర్నీతి దౌష్ట్య మొకట - గలసి లోకంబు పాపపంకిలము గాగ
ధర్మసంస్థాపనార్థంబు దైవశక్తి - మానవాకృతి గైకొను మాట వినవె ?

తన రూపమునకు బ్రతికృతి - యన మనుజుని సృష్టిచేసె నాదిమ దేవుం
డని యెంతు; బ్రాణికోటుల - మనుజుడు మేధోవిశేషమాన్యుడు గాడే ?

బుద్ధుడును క్రీస్తు మహామదు మొదలుగాగ - నెంద రాచార్యులో జన్మమంది రిలను;
అట్టి మహనీయు లందరు నధమమైన - కోతిసంతతి యని చెప్ప గొంకు లేదె ?

మునుపటినుండి మానవసమూహము గాంచిన యున్నతస్థితుల్
పోనరిచినట్టి కార్యము లపూర్వమనోబలసిద్ధులుం, జిరం
తనమగు దేశనాగరికతల్ బహుశాస్త్రసమార్జనంబు జె
ప్పిన బదియేండ్లు పట్టు ; బృథివిం గల దంతయు జెప్ప సాధ్యమే ?
వీనికి మూలకారకులు విశ్రుతబుద్ధివివేకపూర్ణ వి
ద్యానిలయుల్ సమర్థులు నుదారగుణాఢ్యులు పూజ్యులైన మా

మానవులేగదా, తెలివిమాలి వచించితి వింత సేపు నో
భానుడ, చాలుచాలు, నిక బల్కకు మేల వృథాప్రయాసముల్?

అన విని భాస్కరుండు మదియందు గలంగక నిండుకుండనా
దొనకక మెత్తిపోటులకు దుందుడు కొందక కన్నబిడ్డ వా
కొను పలుకుల్ సహించు జనకుండటు మన్ననచేసి పల్కె నో
మనుజకుమార, సంక్షుభితమానస మారయ లేదు సత్యముఁ.

అన, సూర్యుని శాంతంబున - కును నా మిడిమిట్టిపాటుకును లోఁ సిగ్గుం
గొని వెరగుచెంది శాంతిలి - వినయము యత్నమున గాంచి వింటిని దరకుఁ.

తాతకు దగ్గులు నేర్పెదు - రీతిగ భూలోకచరిత ప్రేలితి వర రే!
మీ తాతాతంద్రుల క - జ్ఞాతము లౌ విషయముల బ్రసక్తియొనర్తుఁ.

ధరణి ముప్పదివేల వత్సరములపుడు - వదలె మనుజు డాటవికజీవనము మొదల;
నాటినుండియు నేటికి నాగరికత - లెన్ని, రాజ్యంబు లెన్ని మోసెత్తి నమసె!

అదియె యొక గొప్పగా జెప్పనేల నీవు - బిందు వంతేను విశ్వజీవితపయోధి;
వృత్తమును నాదు పుట్టుపూర్వోత్తరముల-వయసు విన్న నీ వాశ్చర్యపడుదు వేమొ.

కూపస్థంబగు మండుకంబునకు దిక్కూలంకషాంభోధి వే
లాపర్యంతజలావకాశమును దెల్పఁ దుర్లభం బౌను; న
ట్లాపద్మప్రభవాండసంచరణనిత్యానిత్యయాదృచ్ఛిక
వ్యాపారంబు లెరుంగ నీకు దరమే పల్మారు బోధించినఁ?

అరయఁ నీకు స్వదేశ, మంత బరదేశానీక, మాపైని సా
గరవేలావలయాకృతోర్విని గనంగావచ్చు; నాదృష్టి దు
స్తరవేధోండకటాహమంతటను సంసర్పించు; నట్లౌట ని
ద్ధరకుఁ దృష్టుల జీవితంబుల విభేదంబుల్ నిరంతంబులో.

నావయ సెంతో తెలియునె? - నా విని, తల యడ్డమూప, నవ్వెను రవియుఁ;
మీ వయసు దెల్పి యవ్వల - జీవితముం గూడ నాకు జెప్పుడ యనినఁ.

చెప్ప దేలికయయ్యు నీ చిత్రగాథ - విన్నవారలు నమ్ముట యన్న వింత;
కాని, సర్వంబు జరిగిన కథయె దప్ప - అవగింజంత యత్యుక్తియైన లేదు.

ఎపుడు పుట్టితినోగాని యెరుగజాల - మూడువందలకోటుల యేడులపుడు
ఉగదెలిసె నన్న జ్ఞాపక మున్న; దింక - బ్రతుకవచ్చు ద్రిశతకోటివత్సరములు.

మున్ను నీ వంత పొగడిన భూతధాత్రి - పుట్టె నాకన్ను లెదుటనే పూర్వమందు;
ఎవతెయో యను సందేహ మేల నీకు? - కండలో గండ నావయుగారిపుత్రి.

సుడిగాలి యొక్కపెట్టున - వడి న న్నొక యన్యలోకవాసుల నడుమం
బడ రువ్వినట్టులయి నా - యొడలెల్లను గంపమొంది యూర్చుచునుంటిన్.

తెరగన్నులు తెరనోరును - విరవిర తడియారు నాల్క వెరగుమనంబై
వెరపుగొని పూర్వధైర్యము - తరుగన్ వినయంబు లోన దండడిగొనగన్.

జలజాతాప్తుని భక్తినమ్రమగు పీతాంశుమాల సేవించి యం
జలిబద్ధుండనుగా వచించితిని: ఓస్వామీ, జగత్సాక్షీ, చం
చలచిత్తంబున బ్రేలుచుండిన నను న్సంభ్రాంతు మన్నించి నా
కలుషంబుల్ హరియింపు మంచు గరుణం గాంక్షించి ప్రార్థించితిన్.

అజ్ఞానతిమిరనష్ట - ప్రజ్ఞుడనై యల దివాంధభావంబున మీ
విజ్ఞానరోచిరుదయ మ - వజ్ఞత నరికట్టి హాస్యపాత్రుడ నైతిన్.

అని నే నీవిధి విన్నవింప గరుణాహాసంబు నెమ్మోమునం
దొనరన్, నీ వెపుడైన నామతము పొందుం బాడియుం గందు వం
చనుకొందుం, డడవేల, నాచరిత నెయ్యంబార వర్ణించెదన్
వినవోయీ, యని చెప్పసాగె హృదయావిర్భూతచిత్రంబుగన్.

[సశేషము]



# ఆంధ్రదేశమున సంగీతము యొక్క పరిణామము

= శ్రీ విస్సా అప్పారావు =

ఆంధ్రుల రాజ్యము, ఆంధ్రుల తేజము క్రీస్తు శకారంభకాలమున మిక్కిలి ఉన్నత స్థితిలో నుండెను. ఈ ౨౦౦౦ సంవత్సరముల నాటినుండి ఆంధ్రులు పేరుప్రతిష్ఠలు కలిగియున్నారు. గౌతమీపుత్ర శాతకర్ణి కాలమున ఆంధ్రదేశము ఉత్తరమున నర్మదా తీరమువరకును, దక్షిణమున చేరదేశమువరకును, పడమర తూర్పున సముద్రమువరకును వ్యాపించియుండెడిది. నాటి శాతవాహనుల తరువాత కాలక్రమమున ఇక్ష్వాకులు, పల్లవులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు, చాళుక్యులు, కాకతీయులు, రెడ్లు, విజయనగర రాజులు, మహమ్మదీయులు మొదలైనవారు పాలించుచువచ్చిరి. వారి రాజ్యములు పైన చెప్పిన ఎల్లల మధ్యమున ఖండ ఖండములుగా వ్యాపించియుండెను. ఈ రాజ్యములయందు పరిపాలింపబడిన ప్రజలందరు తెలుగువా రని చెప్పవీలులేదు. మహారాష్ట్రులు, కన్నడులు, అరవవారు మొదలగు భారతీయసోదరు లెందరో తెలుగువారితో కలసిమెలసి జీవితములు గడపుచుండెడివారు.

తినుట కన్నమును, కట్టుటకు బట్టయు పుష్కలముగా నుండి, దేశము సుభిక్షమై, శాంతివంతమై యుండుటయు, రాజులు జనాభిమానము, దేశక్షేమము ఆశయములుగా పరిపాలించుటయు తటస్థించినచో ఏకాలమందైనను కావ్యము, సంగీతము, చిత్రము, శిల్పము మొదలగు కళ లభివృద్ధిని చెంది దేశము నాగరికతతో శోభిల్లుచుండుట చరిత్రాత్మకమగు సిద్ధాంతము. ఒకకళ వృద్ధిచెందినప్పుడు ఇతర కళలుకూడ అభివృద్ధి నొందుట సామాన్యమని చెప్పవచ్చును. ఈ వ్యాసమందలి విషయము సంగీతకళ-దాని పరిణామము. ఇది చాలా పెద్ద విషయము. పూర్తిగా వివరించుటకు నాకు శక్తిగాని, అవకాశముగాని తక్కువ. అందుచేత కొన్ని ముఖ్యమైన ఘట్టములను మాత్ర మెత్తి కొంత వ్రాయ ప్రయత్నింతును.

పదియవ శతాబ్దివరకు ఆంధ్రమున ప్రత్యేక గ్రంథములు లేవనుట సుప్రసిద్ధము. అందుచేత రమారమి నాటివరకు ఆంధ్రుల సంగీతకళను గుర్తించుటకు సంస్కృత గ్రంథములే యాధారములు. భరతుని నాట్యశాస్త్రము, నారదశిక్ష, మతంగుని బృహద్దేశి, శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరమును ముఖ్యమైన కొన్ని సంగీతశాస్త్రగ్రంథములు. నృత్తము, గీతము, వాద్యము కలసినది సంగీతమని పూర్వాచార్యులు తలచిరి — "గీతం వాద్యం తథా నృత్యం త్రయం సంగీతముచ్యతే (గీతం వాద్యంచ నృత్తంచ)" అని సంగీతరత్నాకరము. భరతుని నాట్యశాస్త్రమందు ఈమూడింటినిగురించియే కాక నాటకకళనుగురించి అపూర్వవిషయము లెన్నో చెప్పబడియున్నవి. ఇందు నాట్యకళ ప్రధానముగా ఎన్నబడినది. గీతము నాట్యమునకు ప్రధానాంగముగా చెప్పబడినది. ఆకాలమందలి పద్ధతి అది. ప్రాచీనకాలమం దట్లుండుట స్వాభావికమే. ఈకాలమందుకూడ పెక్కు దేశములయందు నాట్యకళకు ప్రాధాన్యము కలదు. మన దేశమందుకూడ జానపదుల జీవితములో నాట్యమున కెక్కుడు ప్రాముఖ్యము పొడగట్టుచున్నది. రత్నాకరమందు గీతమునకు ప్రాముఖ్య మీయబడినది. "గీతవాద్యోభయం యత్ర సంగీత మితి కేచన" యనియు నొక మతము కలదు. ఇదే నేటి సంగీతపద్ధతి. గీతమున గాత్రపాట, వీణాగానము ముఖ్యములు. గీతప్రధానమగు సంగీతమునుగురించియే నేను వ్రాయబోవునది.

మార్గము, దేశ్యము అని సంగీతము రెండువిధములు. పరమశివునిచేత బ్రహ్మ కుపదేశింపబడి, భరతమునివలన ప్రచారములోనికి వచ్చినది మార్గసంగీత

మని సంప్రదాయము. ఇది ఇహాముకంటె పరమునకు ముఖ్యసాధనమని చెప్పబడినది. శాస్త్రబద్ధమైన ఆర్యుల సంగీతమార్గ మని దీనిని మన మూహింపవచ్చును. దేశమందలి సామాన్యజనులకు రంజకముగా నుండునది దేశిసంగీత మని చెప్పవచ్చును. దీనియం దంత శాస్త్ర కట్టుండదు. రంజకత్వమే దీని పరమావధి. భరతాదుల సంగీతశాస్త్రగ్రంథములయందు ఆయాకాలపు దేశి సంగీతము వివరింపబడక పోలేదు. వ్యాకరణశాస్త్రాదుల వలెనే సంగీతశాస్త్రముకూడ లక్ష్యము ననుసరించి వ్రాయబడినదే. కాలక్రమమున సంగీతము మార్పు చెందుట స్వభావమే. దానిని శాస్త్రజ్ఞులు గుర్తించుట న్యాయమే. ఇట్టి లక్ష్యలక్షణసమన్వయమైన సంగీతము ననుసరించియే నే వ్రాయబూనినది. దీనికి భిన్నమైన కేవలదేశ్యసంగీతము – బహుజనాదరణమైనది ఎంతో కలదు. నన్నయభట్టునకు పూర్వకాలమునుండియు దేశ్యమగు తెలుగున రచన లెన్నియో యుండెడివి. ఈ ప్రాచీనమగు వాఙ్మయము అనేకగేయరూపములతో వాడబడుచుండెడిది. అట్టి రచనలే నేటికిని దేశ్యసంగీతమందు ప్రచారములో నున్నవి. పాటలు, జోలలు, ఏలలు, కుమ్మెదపదములు, గొబ్బిపదములు, వెన్నెలపదములు, యక్షగానములు మొదలైనవి కొన్ని ముఖ్యములు. ఇట్టివి జనపదములలో వారి యమాయకమగు జీవితములయందు నేటికిని వాడుకలో నున్నవి. వీటినిగురించి వ్రాయుట కిప్పు డవకాశము లేదు. కాని, ఈ సంగీతభాగము చాలా ముఖ్యమైనదనీ, పునరుద్ధరింపబడవలసియున్నదనీ, దేశవృద్ధికి ఇది మిక్కిలి తోడ్పాటునిచ్చునది యనిన్నిమాత్రము చెప్పి విరమించుచున్నాను.

## రా గ ప ద్ధ తి

భారతదేశమందలి సంగీతముయొక్క ముఖ్యలక్షణము రాగపద్ధతి. ప్రాచీనశాస్త్రములయందు దీనినిగురించి తలొకరీతిగాను చెప్పబడియున్నది. అన్నింటిని సమన్వయముచేసి వాటికి కొంచెము హెచ్చుతగ్గగా నుండే రాగపరిణామపద్ధతిని స్థూలముగాను, క్లుప్తముగాను వ్రాయుచున్నాను. పాటకు మంద్ర, మధ్య, తార లని స్థాయిలు మూడు. ప్రతిస్థాయిలోను (స) షడ్జముతో ప్రారంభమై స రి గ మ ప ధ ని సప్తస్వరములు క్రమముగా పలుకుటచేత స్థాయి పెరుగును. ఒక స్వరమునుండి తరువాతి స్వరమునకు స్థాయిలో అంతరములు కలవు. ఈ అంతరములను శ్రుతు లందురు. క్రింది స్థాయిలోని నిషాదమునుండి ౪ శ్రుతులు హెచ్చినగాని పైస్థాయిలోని షడ్జస్వరము పలుకదు. స్వరములమధ్య శ్రుత్యంతరములను దెలుపుచు క్రింద వ్రాయుచున్నాను. (చూ: I, II పట్టికలు).

I. ఒక్కొక్కస్థాయికి ౨౨ శ్రుతులు. షడ్జ, మధ్యమ, పంచమములకు నాల్గేసి, రిషభ ధైవతములకు మూడేసి, గాంధార నిషాదములకు రెండేసి శ్రుతులనుట కిదే కారణము.

౧, ౨-వ పట్టికలు

| I | ని | స | రి | గ | మ | ప | ధ | ని | సా |
|---|---|---|---|---|---|---|---|---|---|
| శ్రుతుల అంతరము | … | ౪ | ౩ | ౨ | ౪ | ౪ | ౩ | ౨ | ౪ |
| స్వరస్థానము వరకు గల మొత్తము శ్రుతులు | | ౪ | ౭ | ౯ | ౧౩ | ౧౭ | ౨౦ | ౨౨ | |

| II స్వరముల మధ్యగల శ్రుతుల అంతరము | అంతరమునకు సరిపోల్పతగు స్పందనపు తరచుతనపు రెట్లు | ఇంగ్లీషు అంతరము పేరు | |
|---|---|---|---|
| ౪ | ౯/౮ | Major tone | ౨౨ శ్రుతుల పట్టీలోని ౪ శ్రుతుల అంతరము లన్నింటికి స్పందనపురెట్లు ౯/౮ సరిగా నుండక పోవచ్చును. రమారమిగా మాత్రమే సరిపోవును. ఇట్లే తక్కిన రెండు శ్రుతుల భేదములకు కూడ. |
| ౩ | ౧౦/౯ | Minor tone | |
| ౨ | ౧౬/౧౫ | Semi_tone | |

II ఒక వీణతీగ మ్రోగునప్పుడు ఒక సెకను కాలములో అది ఎన్నిసార్లు కంపించునో దానిని స్పందనపు తరచుతనము (vibration frequency) అందురు. ఒక స్వరముయొక్క తరచుతనముకంటె ఇంకొక స్వరముయొక్క తరచుతనము ఎన్నిరెట్లు ఉంటే ఆ రెట్లను అంతర మందురు. ౯/౮ రెట్లు కంపించినచో ౪ శ్రుతుల అంతరము కలుగును. ఇట్లే తక్కినవిన్ని.

నేటి సంగీతపద్ధతిలోవలె ప్రాచీనకాలమందు షడ్జపంచమస్వరములు స్థిరములుగాక భేదములుగా ఉండెడివి. అనగా ప్రాచీనకాలమందు షడ్జము, మధ్యమము, పంచమములలో నాల్గేసి భేదములు, రిషభ ధైవతములలో మూడు భేదములు, గాంధార నిషాదములలో రెండేసి భేదములు ఉండెడివి. మొత్తము ౨౨ శ్రుతులే. కాని ఈపద్ధతి మారి ఈక్రింద చూపబడిన రీతిని ౨౨ శ్రుతులు నేడు పరిగణింపబడుచున్నవి. ప్రాచీనకాలమందు ౨౨ శ్రుతులు ఇదమిత్థమని సునిశ్చితములుగా లేవు. చెవిని ఆధారముచేసికొని, వీణతీగల కొలతలనుబట్టి గ్రహింపబడేవి. వీణతీగల కొలతలు భేదాలుగా చెప్పబడినవి. కాని రానురాను శాస్త్రము నిశితముకాగా ఈక్రిందిపద్ధతి ఏర్పడినది. ఐనను ప్రతి మధ్యశ్రుతులలో మతభేదము నేటికిని కలదు.

III ఈపట్టీలో కొన్ని విశేషములు గలవు. స్వరము భేదించినచోట శ్రుతి ౨౫౬/౨౪౩ రెట్లు పెరుగుచుం

3-వ పట్టిక

| | శ్రుతిసంఖ్య | | స్వరములు | | పేరు | | తరచుతనపు రెట్లు | |
|---|---|---|---|---|---|---|---|---|
| | ౪ | ౧ | | స | శుద్ధ షడ్జ | ౨౫౬/౨౪౩ | ౧ | |
| X | ౫ | ౨ | ర | రి$_1$ | ఏకశ్రుతి రిషభ | | ౨౫౬/౨౪౩ | ౮౧/౮౦ |
| | ౬ | | రి | రి$_2$ | ద్విశ్రుతి ,, | ౨౫/౨౪ | ౧౬/౧౫ | |
| | ౭ | ౩ | రు | రి$_3$ | త్రిశ్రుతి ,, శుద్ధరిషభ | | ౧౦/౯ | ,, |
| | ౮ | | రె | రి$_4$ | చతుశ్శ్రుతి ,, | ౨౫౬/౨౪౩ | ౯/౮ | |
| | ౯ | ౪ | గ | గ$_1$ | శుద్ధ గాంధార | | ౩౨/౨౭ | ,, |
| | ౧౦ | | గి | గ$_2$ | సాధారణ ,, | ౨౫/౨౪ | ౬/౫ | |
| | ౧౧ | ౫ | గు | గ$_3$ | అంతర ,, | | ౫/౪ | ,, |
| X | ౧౨ | | గె | గ$_4$ | చ్యుత మధ్యమ గాంధార | ౨౫౬/౨౪౩ | ౮౧/౬౪ | |
| | ౧౩ | ౬ | మ | మ$_1$ | శుద్ధ ,, | | ౪/౩ | ,, |
| X | ౧౪ | | మి | మ$_2$ | తీవ్ర ,, | | ౨౭/౨౦ | ,, |
| | ౧౫ | ౭ | ము | మ$_3$ | తీవ్రతర, లేక ప్రతి మధ్యమ | | ౪౫/౩౨ | (౬౪/౪౫) |
| X | ౧౬ | | మె | మ$_4$ | తీవ్రతమ మధ్యమ, లేక చ్యుత [పంచమ | | ౬౪/౪౫ | ౮౧/౮౦ |
| | ౧౭ | ౮ | | ప | శుద్ధపంచమ | ౨౫౬/౨౪౩ | ౩/౨ | |
| X | ౧౮ | ౯ | ద | ధ$_1$ | ఏకశ్రుతి ధైవత | | ౧౨౮/౮౧ | ,, |
| | ౧౯ | | ది | ధ$_2$ | ద్విశ్రుతి ,, | ౨౫/౨౪ | ౮/౫ | |
| | ౨౦ | ౧౦ | దు | ధ$_3$ | త్రిశ్రుతి ,, శుద్ధధైవత | | ౫/౩ | ,, |
| | ౨౧ | | దె | ధ$_4$ | చతుశ్శ్రుతి ,, | ౨౫౬/౨౪౩ | ౨౭/౧౬ | |
| | ౨౨ | ౧౧ | న | ని$_1$ | శుద్ధ నిషాద | | ౧౬/౯ | ,, |
| | ౧ | | ని | ని$_2$ | కైశిక ,, | ౨౫/౨౪ | ౯/౫ | |
| | ౨ | ౧౨ | ను | ని$_3$ | కాకలి ,, | | ౧౫/౮ | ,, |
| X | ౩ | | నె | ని$_4$ | చ్యుతషడ్జ నిషాద | ౨౫౬/౨౪౩ | ౨౪౩/౧౨౮ | |

౧,౨,౩,౪...౧౨ అనునవి చతుర్దండిప్రకాశికకర్తయగు వెంకటమఖి ఏర్పరిచిన స్వరస్థానములు. స,పలలో మార్పు లేదు. తక్కిన ౨౦ శ్రుతులను రెండింటిని ఒకటిగా చేర్చి ౧౦ స్థానములుగా విభజించినాడు. అందుచేత ౨౨ శ్రుతిస్థానములు ౧౨ స్వరస్థానములక్రింద గ్రహింపబడుచున్నవి. ఇది నేటి సంగీతపద్ధతిలోని స్వరస్థానముల ఏర్పాటు.

డును. స-రి$_{౧}$, రి$_{౪}$-గ$_{౧}$, గ$_{౪}$-మ$_{౧}$, ప-ధ$_{౧}$, ధ$_{౪}$-ని$_{౧}$, ని$_{౪}$-సే అనుచోట్లు చూడుడు.

ఏకశ్రుతికి ద్విశ్రుతికి } అంతరము ౮౧/౮౦. రి$_{౧}$-రి$_{౨}$ }
త్రిశ్రుతికి చతుశ్రుతికి } రి$_{౩}$-రి$_{౪}$ }

మొదలైనవి చూడుడు.

త్రిశ్రుతి ద్విశ్రుతులమధ్య ఎప్పుడును ౨౫/౨౪ అంతరము కలదు. (రి$_{౨}$-రి$_{౩}$, గ$_{౨}$-గ$_{౩}$, ధ$_{౨}$-ధ$_{౩}$, ని$_{౨}$-ని$_{౩}$) మూడంతరములలో ౨౫౬/౨౪౩ పెద్దది, ౮౧/౮౦ చిన్నది. ౨౫/౨౪, ౮౧/౮౦ ఈ రెండు ఏకశ్రుతిభేదమును కలిగించు అంతరములే. వీటిలో చిన్నది ౮౧/౮౦. ఈ అంతరమే మ$_{౪}$-పలకు గలదు. మునుండి ప్రకు స్వరస్థానము మారినప్పుడుమాత్రము తక్కినచోట్లవలెగాక అంతరము అన్నిటికంటె తక్కువ ప్రమాణముగల ౮౧/౮౦ గా ఉన్నది. దీనిని ఇంగ్లీషులో కామా యని యందురు. దీనిని ప్రమాణశ్రుతి యనవచ్చును. ఈ మాటను మధ్యమగ్రామమందలి పంచమశ్రుతి గురించి మాట్లాడుచు భరతముని నాట్యశాస్త్రమం దుపయోగించినాడు.

గానము వేదోచ్చారణతో ప్రారంభమైన దని చెప్పవచ్చును. ఉదాత్తానుదాత్త స్వరితము లను మూడు స్వరభేదములతో వేదోచ్చారణ ఉండును. ఇవి క్రమముగా మధ్యమస్థాయిలోని రిషభము, మంద్రస్థాయిలోని నిషాదము, మధ్యస్థాయిలోని షడ్జముగా గుర్తించవచ్చును. అనగా రిసని అను ఉచ్చారణగా గ్రహించవచ్చును. సామగానము ప్రబలినకొలది గరిసని, గరిసనిధ అను సంచారములతో సామగానము చేయబడెను. దీని నాధారము చేసికొని మగరిసనిధప యను ఒక సంపూర్ణస్థాయి గ్రహింపబడెను. ఇది అవరోహణక్రమము. మధ్య స్థాయిలోని మధ్యమమునుండి మంద్రస్థాయిలోని పంచమమువరకు దిగుట. మధ్యస్థాయిలోని షడ్జముతో ప్రారంభించి ఆరోహణక్రమమున సరిగమపధనిసే యని తారస్థాయిలోని షడ్జమువరకు పోవచ్చునని క్రమముగా తరువాత గ్రహింపబడియుండును. ఈ ఆరోహణపద్ధతి – క్రింది షడ్జము నుండి పై షడ్జమువరకు పోవు పద్ధతి లౌకికగానమును పురస్కరించుకుని గ్రహింపబడియుండును. ఈ స్వరసప్తకము వేదగానమున గుర్తింపబడుటచేత ఇందలి స్వరములను శుద్ధము లని, ప్రకృతు లని యందురు. III పట్టీలోని ౪, ౭, ౯, ౧౩, ౧౭, ౨౦, ౨౨ సంఖ్య గల శ్రుతులనే శుద్ధము లని యందురు. వీటికి భేదముగా పలికిన వాటిని వికృతు లందురు. III పట్టీలో వికృతులు ౧౫ చూపబడినవి. వైదికగానమున వాడు శ్రుతులు శుద్ధములు-లౌకికగానమందే విశిష్టముగా వాడబడునవి వికృతులు.

(i) గ్రామములు.

గరిసనిధపమ యని అవరోహణక్రమముగా నుండు స్వరసప్తకమును గాంధారగ్రామ మందురు. గతో ఆరంభము.

మగరిసనిధప యని అవరోహణక్రమముగా నుండు స్వరసప్తకమును మధ్యమగ్రామ మందురు. మతో ఆరంభము.

సరిగమపధని యని ఆరోహణక్రమముగా నుండు స్వరసప్తకమును షడ్జగ్రామ మందురు. సతో ఆరంభము.

ఈమూడే ప్రాచీనకాలమం దుపయోగింపబడిన స్వరసప్తకములు. అన్నింటికంటె ప్రాచీనమైన గాంధారగ్రామము భరతుని కాలమునాటికే వాడుకనుండి అంతరించినది. భరతుడు మధ్యమ, షడ్జగ్రామములు మాత్రమే లోకమందు విశ్రుతము లని చెప్పియున్నాడు. మధ్యమగ్రామములోని పంచమము షడ్జగ్రామములోని పంచమముకంటె ఒక శ్రుతి తక్కువయని, III పట్టీలోని ౧౭ సంఖ్యగల శ్రుతిగాక ౧౬ సంఖ్యగల చ్యుతపంచమమని భరతుడు నాట్యశాస్త్రమందు చెప్పియున్నాడు.

(ii) మూర్ఛనలు.

మ$_{౪}$గ$_{౨}$రి$_{౩}$స$_{౪}$ని$_{౨}$ధ$_{౩}$ప$_{౪}$మ యని మధ్యమగ్రామము. అక్షరములమధ్య నున్న అంకెలు శ్రుత్యంతరముల దెలుపును. ఇవి శుద్ధస్వరస్థానములు. III పట్టీ ప్రకారము స్పందనపు తరచుతనపు రెట్లు వరుసగా ఇట్లు—౪/౩, ౩౨/౨౭, ౧౦/౯, ౧, ౧౫/౧౬, ౫/౬, ౪౦/౫౪, ౨/౩. మొదటి నాల్గు ఒకస్థాయిలోవి. తక్కిన నాల్గు క్రిందిస్థాయిలోవి. క్రిందిస్థాయిలోని ప్రయొక్క తరచుతనము పైస్థాయిలో

స్వరయొక్క తరచుతనములో సగమే. ఇట్లే క్రిందిస్థాయిలోని ప్రతిస్వరముయొక్క తరచుతనముగాని, తరచుతనపు రెట్లుగాని లెక్కింపవలెను. కనుకనే III పట్టీలో నున్న ౧౬/౯, ౫/౩, ౪౦/౨౭, ౪/౩ అను అంకెలలో సగముమాత్రమే పైన వ్రాయబడినవి. మధ్యమగ్రామమును ఆరోహణక్రమముగా వ్రాసినచో మ̣ ప̣ధ̣ని̣సరిగమ యని యగును. స్వరములమధ్య నున్న శ్రుత్యంతరములు ఆరోహణక్రమములో ఇట్లుండును—౪ ౩ ౨ ౪ ౩ ౨ ౪—మొత్తము ౨౨. తరచుతనపు రెట్లయొక్క క్రమము ఇట్లుండును—౨/౩, ౨౦/౨౭, ౫/౬, ౮/౯, ౧, ౧౦/౯, ౩౨/౨౭, ౪/౩ ఆరోహణలో. ౨/౩ అని ఆరంభించుటకంటె దానిని ౧ క్రింద మార్చిన లెక్కకు సులువుగా నుండునుగాన అట్లు చేయుదుము. ౨/౩ ను ౧ చేయుట అనగా ౨/౩ ను ౩/౨ పెట్టి గుణించుట. మొదటి అంకెనుమాత్రము ౩/౨ రెట్లకింద హెచ్చిస్తే దానికి తక్కిన అంకెల తరచుతనపు రెట్లకు ఇదివరకున్న అంతరము మారును గనుక అట్టి భేదము లేకుండ చేయుట కన్నిటిని ౩/౨ పెట్టి గుణించవలెను. అప్పుడు ఆవరుస ఇట్లుండును— ౨/౩ × ౩/౨, ౨౦/౨౭ × ౩/౨, ౫/౬ × ౩/౨, ౮/౯ × ౩/౨, ౧ × ౩/౨, ౧౦/౯ × ౩/౨, ౩౨/౨౭ × ౩/౨, ౪/౩ × ౩/౨, అనగా ఇట్లు— ౧, ౧౦/౯, ౫/౪, ౪/౩, ౩/౨, ౫/౩, ౧౬/౯, ౨.

ఆరోహణక్రమము ఎడమనుండి కుడికి, అవరోహణక్రమము కావలసినచో దీనికే కుడినుండి ఎడమకు వ్రాసిన వచ్చును.

## మూర్ఛనలు

ఇక మూర్ఛన లనసేమో విచారింతము.

మధ్యమగ్రామమూర్ఛనలు — ౭

అవరోహణక్రమము

1. మ ౪ గ ౨ రి ౩ స ౪ ని̣ ౨ ధ̣ ౩ ప̣ ౪ మ̣
2. గ ౨ రి ౩ స ౪ ని̣ ౨ ధ̣ ౩ ప̣ ౪ మ̣ ౪ గ̣

ఆరోహణక్రమము

1. మ̣ ౪ ప̣ ౪ ధ̣ ౨ ని̣ ౪ స ౩ రి ౨ గ ౪ మ
2. గ̣ ౪ మ̣ ప̣ ౩ ధ̣ ౨ ని̣ ౪ స ౩ రి ౨ గ

ఇట్లే ఇంకొక ఐదు.

పైన సూచించినట్లు ఆరంభస్వరమును మ, గ, రి, స, ని, ధ, ప యని క్రమముగా మార్చి మధ్యమగ్రామమును అవరోహణక్రమముగాను, ఆరోహణక్రమముగాను వ్రాసినచో ఏడు భేదములు కలుగును. ఈవరుసలలోని మొదటి స్వరమును (గ్రహస్వరమును) ఆధారషడ్జముగా గ్రహించవలెను. అప్పుడు రెండవ స్వరము నిషాదముగాని, రిషభముగాని యగును—అవరోహణ, ఆరోహణలలో. అందుచేత మొదటివరుసలోని రెండవది షడ్జముకంటె ౪ శ్రుతులు తక్కువయగు నిషాదమగును. రెండవ వరుసలోనిది రెండుశ్రుతులుమాత్రమే తక్కువయగు నిషాదమగును. అందుచేత రెండు వరుసలలోని రెండవ స్వరమగు నిషాదము భేదముగా పలుకును. ఇట్లే మూడు, నాల్గు...ఏడు స్వరములున్ను. అందుచేత ఒక్కొక వరుసలోని అవరోహణఆరోహణలు ఉచ్చరించినప్పుడు ౨, ౩, ౪, ౫, ౬, ౭ స్థానములలోని స్వరములు, అనగా రిషభములు, గాంధారములు మొదలైనవి సమానశ్రుతులు కలవి కాకుండుటచేత ఆ ఉచ్చారణవలన కలుగు శ్రవణానుభవము భేదముగా ఉండును. ఈ భేదానుభవమునకే మూర్ఛన యని పేరు. శ్రుత్యంతర భేదములలోని వరుస మారుటచేత స్వరమేళము మారుట, మూర్ఛనయొక్క కళ భేదించుట తటస్థించుచున్నది. ఈ కళాభేదమును చెవి సులభముగా గుర్తించగలదు. ఈ మూర్ఛనాభేదములే రాగభేదములకు ప్రాతిపదికములు.

షడ్జగ్రామమునుండికూడ ఇట్లే ఏడు మూర్ఛనలు పుట్టును. ఈ ౧౪ మూర్ఛనలలో కొన్నింటికి స్వల్పభేదముమాత్రమే ఉండుటచేత మధ్యమగ్రామము నుండి మూడింటిని, షడ్జగ్రామమునుండి నాల్గింటిని మాత్రమే గ్రహింపబడి తక్కినవి విడువబడెను. గ్రహింపబడిన ౭ మూర్ఛనలను క్రింద నిచ్చిన IV పట్టీలో ✓ అను గుర్తుతో చూపడమైనది.

ఇంతవరకు మూర్ఛనలలోని భేదములు కలుగుట ఎట్లో శ్రుత్యంతరముల మూలకముగా స్థూలముగా తెలిపితిని. ఆ భేదముల స్వరూపమును విస్పష్టముగా తెలిసికొనవలె నన్న, స్పందనపు తరచుతనపు రెట్ల సహాయమున బాగుగా తెలిసికొనవచ్చును. మధ్యమగ్రామములోని మొదటి మూర్ఛనను తరచుతనపు రెట్లుగల అంకెలతో ఎట్లు గుర్తించవచ్చునో పైని చూపబడినది. తిరిగి దానిని ఆరోహణక్రమము, అవరోహణ

మేళము లని పేరు వాడుచున్నాము. అట్టి మేళములకు నేటి సంగీత పద్ధతిలో పేర్లు కలవు. వాటిని ౭౨ మేళకర్త రాగముల నిచ్చు శాస్త్రగ్రంథములు చూచి నచో గుర్తింపవచ్చును. ఆ పేర్లనుకూడ ఈ పట్టీలో ఇచ్చినాను. ఏస్వరములలో భేద మున్నదని తోచి నచో ఆస్వరములను సూచించు అంకెలక్రింద గీత గీసి పేరు ప్రక్కన ? అని వ్రాసితిని. పాశ్చాత్య సంగీత మందు ప్రాచీనమైన రాగ మేళములు కొన్ని సుప్రసిద్ధ ములు కలవు. వాటికి ఇవి సరిపోలినచో ఆ పేరుకూడా ఇంగ్లీషులో వ్రాసినాను.

(iii) జాతులు.

మూర్ఛనకు లక్షణములు రెండు—ఆరోహణ, అవరోహణ. స్వరోచ్చారణ చేయుటలో క్రమముగా రంజకత్వము పెరిగినది. రంజకత్వమును పోషించు గ్రహము, అంశన్యాసము * మొదలైన లక్షణములు ఏర్పడినవి. మూర్ఛనలోని స్వరములకు ఈలక్షణములు చేర్చి సప్తస్వరములలో కొన్నింటినిమాత్రమే ఒక్కొక సారి ఉచ్చరించుచు గానముచేయుటచేత మూర్ఛన జాతిగా మారియుండును. ఇట్లే సప్తమూర్ఛనలకు సప్తజాతులు కల్పింపబడినవి.† భరతుని కాలమునాటికే ఈమార్పు కలిగినది. భరతుడు ఈ సప్తజాతులను మాత్రమే చెప్పియుండలేదు. ఈజాతులు నేటి రాగ ములకు సరిపోల్ప తగినవి. స్వరసప్తకము కలిగిన సంపూర్ణమని, ౬, ౫ స్వరములుమాత్రమే కలిగిన షాడవమని, ఔడవమని జాతులలో మూడువిధములు. ఈమూడున్ను భరతముని చెప్పినాడు. మరియు శుద్ధస్వరములతో కొద్దిగా వికృతస్వరములను చేర్చి సాధారణ వికృతులను జాతులను చెప్పియున్నాడు. భరతమునియొక్క రాగకల్పనాపద్ధతిలో అనేకవిశేష ములు గలవు.

గ్రామములనుండి మూర్ఛనలు, మూర్ఛనల నుండి జాతులు ఎట్లు కల్పింపబడినవో తెలిసికొంటిమి. ఇక రాగము లెట్లు కల్పింపబడినవో తెలిసికొనవలసి యున్నది. కాని, గ్రామములవిషయమై ప్రాచీన సంగీతాచార్యులలో గల మతభేదమును కొంత వివరించి తరువాత రాగములనుగురించి చెప్పబూనెదను. భరతా చార్యుల మతము ప్రథమము. గ్రామమనగా ఇట్టిది యని భరతాచార్యులు నిర్వచనము నివ్వలేదు. కాని మధ్యమగ్రామమును నాటకముయొక్క 'ముఖ'మందు, షడ్జగ్రామమును 'ప్రతిముఖ'మందు గానముచేయవలసిన దని చెప్పియున్నాడు. నాటకమునకు సంధులు ఐదు. అందు మొదటి రెండు సంధుల పేర్లు ముఖము, ప్రతి ముఖమును. దీనినిబట్టి గ్రామములు గానముచేయుట కుపయోగపడు స్వర మేళములు కలవి యైయుండి తీరవలయును. మతంగుడు, శార్ఙ్గదేవుడు, తరువాతి వారు గ్రామమనగా స్వరసందోహ మని చెప్పినారు. "యథా కుటుంబిన స్సర్వే ఏకీభూతా భవంతిహి, తథా స్వరాణాం సందోహో గ్రామ ఇత్యభిధీయతే" శుద్ధవికృతిస్వరము లన్నిటియొక్క సమూహమునకు గ్రామ మను పేరుతో వ్యవహారము కలదని మన మర్థము చేసికొనవలసియున్నది. అన్ని స్వరములతోను గానముచేయ వీలులేదుగనుక గ్రామములు గానార్హ ములు కావని చెప్పవలసియున్నది. గ్రామస్వరముల నుండి ఇష్టానుసారముగ స్వరములను ఏరుకొని మూర్ఛ నలు, జాతులు ఏర్పరుపబడియుండు నని సమన్వయము చేయవలయును. దీనినిబట్టి గ్రామమనగా రెండు విధముల యభిప్రాయము గలదని గ్రహింపవలసి యున్నది. (i) గానార్హమగు స్వర మేళము,(ii) గానా ర్హముకాని స్వరములగుంపు అని రెండువిధములు. ఈ రెండవ పద్ధతి సమంజసమైనది గాదు. లక్ష్యము అన్నింటికంటె ప్రబలమైనది. ఆర్యులు అరణ్యనివాస మును విడిచి గ్రామనివాసము చేయుట ప్రారంభించిన కాలమందు గ్రామగానము ప్రారంభమైయుండును.

* గ్రహము-ఆరంభమున గల స్వరము; అంశ-జీవస్వరము; న్యాసము-చివరిస్వరము.

† భరతుని నాట్య శాస్త్రమందున్ను, సంగీత రత్నాకరములోను మధ్యమగ్రామమునుండి ౧౧ జాతులు పుట్టిన వని, షడ్జగ్రామమునుండి ౭ జాతులు పుట్టిన వని చెప్పబడి వాటి పేర్లిన్వబడినవి. జాతుల కల్పనలో మార్పులు ఎన్నో కలిగెనని దీనినిబట్టి మనము గ్రహింప వలసియున్నది. ఈజాతు లేయే రసములయం దుపయో గింపవలెనో భరతుడు చెప్పియున్నాడు.

ఆరోహణ అవరోహణలు లేనిదే గానము కానేరదు. ఇది వైదికగానమంతుకాక లౌకికమగు గానమున వృద్ధి పొందియుండును. గ్రామములు జాతులుగా విస్తరింపబడియుండును. లక్ష్యగానములకు లక్షణము చెప్పుటకై శాస్త్రజ్ఞులు కల్పించిన పద్ధతిలో మూర్ఛనలు ఏర్పడినవిగాని వాడుకలో గ్రామములు, జాతులుమాత్రమే ఉండియుండుట సహజము. అందుచేతనే భరతముని గ్రామమునకు ప్రత్యేకించి నిర్వచనము చేయలేదని తోచుచున్నది.

(iv) రాగములు.

III పట్టీలో రిషభ, గాంధార, ధైవత, నిషాద భేదములలో సామ్యము గలదు. ఏకశ్రుతి ద్విశ్రుతుల కున్ను, త్రిశ్రుతి చతుశ్రుతులకున్ను గల అంతరము ప్రమాణశ్రుత్యంతరమగు ౮౧/౮౦. ఈఅంతరము అన్నింటికంటె తక్కువైనది. అందుచేత రి$_1$, రి$_2$లను చేర్చి ఒక స్థానమునందు, రి$_3$, రి$_4$లను ఇంకొకస్థానమునందు చేర్చి రిషభమునకుగల నాలుగు శ్రుతుల భేదములను సంకుచితముచేసి రెండు స్థానములయందు రిషభమును స్థాపించవచ్చును. ఇట్లే గాంధార, ధైవత, నిషాదములను సంకుచితముచేసి ఒక్కొక్కదానిని రెండు స్థానములయందు సూచించవచ్చును. ఇట్లే మధ్యమమును శుద్ధమధ్యమని, ప్రతిమధ్యమని రెండు స్థానములయందే చూపవచ్చును. స, పలకు భేదములులేవు. గనుక ౨౨ శ్రుతులను ౧౨ స్థానములలో చూపవచ్చును. ఈ సంకేతమునే చతుర్దండిప్రకాశికకర్తయగు వేంకటమఖి మొదట ఏర్పాటుచేసినాడు. వీణలోని ౧౨ మెట్లు ఈ పన్నెండుస్థానములకు సరిపోవును. రి, గ, మ, ధ, నిలలోని రెండేసి స్థానములలో ఒక్కొకదానిని ఏరి స, ప లను చేర్చినచో ఏడు స్వరములు గల సంపూర్ణమేళ మేర్పడును. ఇట్లు ప్రస్తరించి వేంకటమఖి ౭౨ సంపూర్ణమేళములను, మేళకర్తలను ఏర్పరచెను. వీటినే జనకరాగమేళము లందురు. ఇదే నేటి రాగనిర్మాణపద్ధతి. ఆరోహణ అవరోహణములు, గ్రహాంశన్యాసములు మొదలగు లక్షణములు, వివిధగమకములు ‡ మొదలగు విన్యాసములతో త్రిస్థాయియందు స్వరమేళమును ప్రస్తరించి, విస్తరించి గానముచేసినచో దానిని రాగమని, రాగాలాపన మని అందుము. ఇట్టి పద్ధతిని కనిపెట్టి రాగప్రస్తారమునకు శాస్త్రీయమైన లక్షణమును చూపి కర్ణాటకసంగీతమునకు వేంకటమఖి మహోపకారమును చేసినాడు. ఇతని పద్ధతిలోని స్వరస్థానములకు గల పేర్లకును, III పట్టీలోని పేర్లకును భేదము కలదు. కాని ౭౨ మేళకర్తలలోను ఆ ౨౨ శ్రుతులు ఉపయోగమగుచుండును కాని వాటికి పేర్లు భేదములుగా వాడబడుచున్నవి. జనకరాగములు సంపూర్ణములు. వీటినుండి షాడవ, ఔడవములగు జన్యరాగములు ఏర్పడినవి. స్వరములు స రి గ యని క్రమముగా పోకగక స గ రి గ యని నడచినచో ఈనడకను వక్రగతి యందురు. వక్రగతు లనేక పోకడలు పోవచ్చును. ఆరోహణ, అవరోహణలయం దొక్కదానిలోగాని, రెండింటియందుగాని సంపూర్ణముగాను, షాడవముగాను, ఔడవముగాను స్వరము లుండవచ్చును. ఆస్వరములగతిలో సక్రమముగాని, వక్రముగాని యుండవచ్చును. ఇన్ని భేదములవలన అనేకరాగములు పుట్టినవి. ఈరాగరచనాపద్ధతి అన్నింటికంటె నవీనమైన ౧. జనకజన్యరాగపద్ధతి.

౨. రాగాంగ, ఉపాంగ, భాషాంగ, క్రియాంగ రాగపద్ధతి :

జనకరాగములే రాగాంగ రాగములు. జనకరాగస్వరములకంటె భిన్నముగాని స్వరములు గల జన్యరాగములను ఉపాంగరాగము లందురు. కొన్ని జన్యరాగములలో ఒకటిరెండు స్వరములు జనకరాగస్వరములకంటె భిన్నములుగా ఉండును. అట్లుండుటచేత ఇతర జనకరాగకళ స్ఫురించి. రంజకత్వము పోషింపబడుచుండును. ఇట్టి జన్యరాగములను భాషాంగ రాగము లందురు. దేవతాస్తుతి చేయుట, యుద్ధవీరుల ధైర్యోత్సాహములను కొనియాడుట మొదలగు 'క్రియల'యం దుపయోగము చేయుటకు కొన్ని రాగములను ప్రత్యేకించుట సంప్రదాయమై యుండెను. వాటిని క్రియాంగ

‡ వినుట కింపుగా ఉండునట్లు స్వరములను కదలించుటకు గమక మని పేరు. ఇది వివిధము.

రాగము లందురు. ఈవిభేదము పదియవ శతాబ్దిప్రాంత ములకే ప్రచారములో నున్నది.

౩. శుద్ధ, సాళగ, సంకీర్ణ-రాగపద్ధతి :

పైన జెప్పిన ౨-వ పద్ధతి, ఈపద్ధతి సమ కాలికము లనవచ్చు. శుద్ధరాగములే రాగాంగ ఉపాంగరాగములు. ఇతరరాగచ్ఛాయ స్వరములు గలవి సాళగములు. గనుకనే వీటిని ఛాయాలగము లని కూడ అందురు. ఇవే భాషాంగములు. ఎక్కువగా అన్య రాగ మిశ్రితములైనచో వాటిని సంకీర్ణరాగము లందురు.

౪. ఘన, నయ, దేశి-రాగవిభాగపద్ధతి :

క్రియాంగరాగములనే ఘనరాగము లనవచ్చును. నాట, గౌళ, వరాళి, ఆరభి, శ్రీ అను ఘనరాగపం చకములో త్యాగయ్యగారు సుప్రసిద్ధమైన కృతిరత్న ములను రచించినారు. కేదార, నారాయణగౌళ, రీతి గౌళ, సారంగనాట, భౌళి యను నీరైదును చేరి ఘన రాగములు పది. రక్తిని కలుగజేయునవి నయరాగములు. వినుటకు సొంపుగా నుండి ఘనరాగములకంటె సుకు మారములుగా నుండును. హిందూస్థాని రాగకళలు కల సిన రాగములకు దేశి (ఉత్తరదేశపు) రాగము లని పేరు. ఫరజు, కమాసు, కాపీ మొదలైనవి. ఈరాగవిభాగ పద్ధతి ౧౮-వ శతాబ్దిప్రాంతములనుండి వాడుకలో నున్నది. సంగీతము కర్ణాటకము, హిందూస్థాని యని ద్వివిధ మేర్పడిన తరువాత వచ్చిన పద్ధతి. ప్రాచీనము కాదు.

౫. స్త్రీ, పురుష, నపుంసక రాగవిభాగము :

ఇది ౪-వ పద్ధతికంటె ప్రాచీనమైనది. ౨, ౩ పద్ధతులతో సమకాలికము. ఇది రాగభావముల ననుసరించి చేయబడిన విభాగము. ఈరాగములకు వేరు వేరు నిర్వచనము భావప్రపంచమందు కల్పింపబడి శ్లోక రూపకముగా నిరూపింపబడి యున్నది. ఈ నిర్వచన మునకు సరియైన చిత్రరచనకూడ ఆయా స్త్రీ పురుష రాగములకు చేయబడినది. అవి రాజపుత్ర చిత్రలేఖనా పద్ధతిని వ్రాయబడినవి.

౬. మార్గ, దేశి రాగములు :

ఈభేదము అతిప్రాచీనము. మార్గసంగీత సంబం ధములు మార్గరాగములు. వాటిలో నాల్గువిధములు రత్నాకరమందు చెప్పబడియున్నవి. ఈనాల్గువిధము లకు చేరినవి ౨౬౪ మార్గరాగములు. అవి అన్నియు వాడుకనుండి తొలగిపోయిన వనికూడ అందే చెప్పబడి యున్నది. సంగీతరత్నాకరమునాటికి వాడుకలో ఉన్న రాగములన్నియును దేశీయరాగములే. ఈ రాగ ములలోని విభాగమే పైన వివరించిన ఐదుపద్ధతులును, గాంధార మధ్యమగ్రామములు అంతరించినట్లే మార్గ రాగములును లౌకికగానమునందు అంతరించినవి. షడ్జ గ్రామమే లౌకికగానమున కాధారము. దీనినుండి పుట్టి నవే దేశీయరాగములన్నీ యని చెప్పవచ్చును.

(౪) దేశ్యగానమందలి ఆంధ్రదేశ్యము.

దేశ్యమనగా దేశమందలి జనులలో వ్యాప్తమై యున్న పద్ధతి. ఈజనులు అనార్యు లని బహుళముగా చెప్పవచ్చును. ఆర్యుల పద్ధతి మార్గపద్ధతి. అతిప్రాచీన కాలమునుండియు రెండును సమ్మేళనమగుచునేవచ్చు చున్నవి. కొంతకాలమువరకు ఈభేదము పాటింపబడి నదిగాని రానురాను దేశీయగానమునకు ప్రాబల్య మధికమై మార్గరాగములు, మార్గపద్ధతి క్షీణించి అంత రించినవి. దేశ్యమే బలపడి నిలిచిపోయినది. ఇది సహజమగు పరిణామక్రమమేగదా. మతంగుని బృహ ద్దేశి యను సంగీతశాస్త్రగ్రంథమందు దేశ్యరాగము లెక్కడనుండి సంక్రమించినదీ విశదముగా వ్రాయ బడినది. ఆకారణముచేతనే కాబోలు బృహద్దేశి యను పేరు పెట్టినదికూడాను. అనార్యుల పేర్లు చెప్పుటలో ఆంధ్రుల పేరుకూడ చెప్పబడియున్నది. దేశ్యమగు అనార్యుల సంగీతమునుగురించి మతంగు డిట్లనెను: "వాల్గు స్వరములలో సంచారముచేసి పాడే పాటలు మార్గ పద్ధతికి జెందజాలవు. అట్టివి శబరలు, పులిందులు, కాంభోజులు, వంగ, కిరాత, వాహ్లిక, ఆంధ్ర, ద్రావిడులు మొదలైనవారు పాడుచుందురు. కాని ధ్రువములు (దరువులు) అను పాటలకుమాత్రము ఈ నిషేధము లేదు. అవి మార్గసంగీతములో చేర్చబడినవి. నాటకములయందు పాడబడుచుండును." ఈదరువులను యక్షగానములయందు, వీథినాటకములయందు నేటికిని వినగలము. సంగీతశాస్త్రములో ప్రబంధాధ్యాయమం దుదాహరింపబడిన రచనలలో ధ్రువములు, వాటిలో భేదములు చెప్పబడినవి. జాతులననుసరించి చెప్పినపుడు

ఫుక్కోటులో రత్నాకరమందు ౧౧ జాతులు మధ్యమ గ్రామమునుండి పుట్టినట్లు వాటిచే క్లిప్తినట్లు చెప్పియున్నాను. అందొకటి ఆంధ్రి. రత్నాకరమందు ఆంధ్రియొక్క నిష్పత్తి చెప్పబడినది. "ని, రి, గ, ప లు అంశస్వరములు, రి, గ లకు, ని, ధ లకు అంశానుక్రమముగా న్యాసమువరకు సంగతి చేయవలయును. షడ్జలోపము చేత షాడవ మగుచున్నది. మూర్ఛన మధ్యమాదిగా చేయవలెను." "పరస్పరము ఒకేసారిగా సంబంధమును మేళనాత్మకముగా కల్పించుట" సంగతి యని వ్యాఖ్యానము. అన్ని జాతులకు వలెనే దీనికిని ఉదాహరణముగా ఒక పాట శివస్తుతిగా స్వరయుక్తముగా ఇయ్యబడినది. ఈజాతులన్నియును నేటి రాగములవలె పాడుట కుపయోగ్యములు. ఆంధ్రినిగురించి నాట్యశాస్త్రమందుకూడ కొంత వివరింపబడియున్నది.

## తెలుగు దేశమందలి సంగీతపరిణామఘట్టములు

ఇంతవరకు రాగపద్ధతినిగురించి చెప్పడమైనది. ఇక తెలుగు దేశమందలి సంగీతపరిణామఘట్టములనుగురించి కొంత వ్రాసెదను. ఇందు ముఖ్యములు క్రీ.శ. ౬౦౦, ౧౩౦౦ ప్రాంతకాలములవాటివి. ఈకాలములయందలి పరిణామములనుగురించి అంతగా తెలియదు. తెలిసినంత వరకు సందేహములు గల విషయములు పెక్కులు గలవు. వాటిని నిరూపించి, ఆసందేహములను నివృత్తి చేయుటకై సంగీతవిద్వాంసులు చేయతగిన కృషిని గురించి కొంత సూచించెదను.

### పల్లవరాజగు మొదటి మహేంద్రవర్మయొక్క కుడిమియామలై శాసనమందలి సంగీతశాస్త్రవిషయము (క్రీ. శ. ౬౦౦-౬౩౫):

దక్షిణదేశమున గొప్ప కళోపాసన చేసి కళలను పోషించి, ఉద్ధరించిన మహారాజులలో ఎన్నతగినవాడు ఈమహేంద్రవర్మ యను పల్లవరాజు. వివిధకళలయందితనికి గల పాండిత్యమును, అభిమానమును మామండూరుశిలాశాసనమున చెక్కబడినది. ఇతడు మత్తవిలాసనాటకకర్త. సిత్తనవాసల్ (సిద్ధనివాస) కొండ గుహయందు అతిసుందరమగు చిత్రములను వ్రాయించెను. ఉండవిల్లిలోని ప్రాచీనమైన కొండగుహాలవంటి కొండగుహాలను చాలా చెక్కించి శిల్పకళను 'విచిత్రచిత్త'ముకలవాడై, 'చిత్రకారపులి'యై పోషించెను. సంగీతకళయందు గొప్ప పాండిత్యము కలవాడు. వైణికుడు. సంకీర్ణజాతి యను తాళభేదమును ఇతడే కనిపెట్టినట్లు కనిపించుచున్నది. నేటి పుదుక్కోట సంస్థానమున గల కుడిమియామలైమీది శిఖనాథస్వామి దేవాలయము వెనుకనున్న కొండచరియమీద సంగీతమున నూతనపోకడలను సూచించు శాసనమును చెక్కించినాడు. అందలి విషయమునుగూర్చి కొంత సంక్షేపించుచున్నాను.

ఈ పల్లవరాజశాసనమునకు, ఆంధ్రదేశసంగీతమునకు సంబంధ మేమని సందేహము కలుగవచ్చును. సమాధానమును నాకు తోచినది చెప్పి మరీ విషయము నెత్తెదను.

౧. ఆకాలమందు సంగీతశాస్త్రము యావద్భారతమునకు ఒకటిగానే యుండెను.

౨. ఆకాలమునకు పూర్వము పల్లవులు గుంటూరుసీమను పరిపాలించిరి. అందుచేత గుంటూరుసీమ పల్లవులనాడుగా నుండెను. నాటి పల్లవులనాడే నేటి పల్నాడు.

౩. గుంటూరుజిల్లాలోని చేజర్లలో ఈమహేంద్రవర్మశాసన మొకటి దొరికినది.

౪. ఈమహేంద్రవర్మకు చాల బిరుదులు కలవు. అందు కొన్ని తెలుగుబిరుదులు.

౫. వేంగిదేశమును పాలించు సాలంకాయనుల తోను, విష్ణుకుండినులతోను పల్లవరాజులకు సంబంధ బాంధవ్యములు కలవు. ఈమహేంద్రవర్మ విష్ణుకుండిన రాజగు విక్రమేంద్రుని దౌహిత్రుడని, యువరాజుగా నున్నకాలమందు కృష్ణాతీరమునుండి కళల నభ్యసించెనని ఒక కథకూడ కలదు.

ఈకారణములచేత ఈ శాసనమునందలి విషయము ప్రసక్తమని వ్రాయుచున్నాను. కుడిమియామలై శాసనము ఏడుభాగములుగా నున్నది. ఆభాగముల పేర్లు, అందలి వివరములు ఈక్రింద V-వ పట్టీలో చూపబడినవి.

౯-వ పట్టిక

| సంఖ్య | పేరు | గుంపులు | స్వరములు | స్వర భేదములు | లేని స్వర భేదములు |
|---|---|---|---|---|---|
| ౧ | మధ్యమగ్రామే చతుష్ప్రహారస్వరాగమాః | ౫ | ౭ | ౨౨ | సి,రి,ష,గ,ధి,ధ (౬) |
| ౨ | షడ్జగ్రామే ,, ,, | ౭ | ౭ | ౨౨ | సి,రి,మ,ప,ధ,ని (౬) |
| ౩ | షాడవే ,, ,, | ౪ | ౭ | ౨౨ | సి,ఇ,సి,ధ,ని,ను (౬) |
| ౪ | సాధారితే ,, ,, | ౫ | ౭ | ౨౨ | ఇ,ప,ధ,క,కి,ఘు (౬) |
| ౫ | పంచమే ,, ,, | ౬ | ౭ | ౨౨ | సి,ఇ,ప,ధ,ని,ను (౬) |
| ౬ | కైశికమధ్యే ,, ,, | ౪ | ౬ | ౨౨ | ఇ,ప,సి,ఫు,పె,కి (౬) |
| ౭ | కైశికే ,, ,, | ౭ | ౭ | ౨౫ ? | ఇ,ప,కి (౩) |

సుబోధకముగా నుండుటకై మొదటి భాగములోని చతుష్ప్రహారస్వరాగమములను కొన్నింటిని ఉదాహరించుచున్నాము.

౧

సిద్ధం నమః శివాయః.

మధ్యమగ్రామే చతుష్ప్రహారస్వరాగమాః

| గుంపు | | | | | పంక్తి |
|---|---|---|---|---|---|
| | సి నె ఫు ప | గి నె గి ప | నె ధు నె ప | ము ఫు నె ప | ౧ |
| (౧) | మి ర గి ప | రు గే ము ను | ప గి నె ప | నె ము పె ను | ౨ |
| | మి గ నె ప | పె ము నె ప | ర మి గ నె | ధు నె గి ప | ౩ |
| | నె ఫు నె ప | పి మ పి పె | గ ధు నె ప | ము నె ఫు — | ౪ |
| | న పె రు గ | మి గ రె గ | నె ప ర గి | ధు నె ర గి | ౧ |
| (౨) | ప గి నె ను | పె ము ర గి | (ము) పెరుగే | గి ప ర గి | ౨ |
| | ప నె ర గి | రు గే ను గే | పి గ రె గ | నె ఫు ర గి | ౩ |
| | ను గే రె గే | గ రె మి గ | పి నె ర గి | పె ర మి గ | ౪ |

ఇట్లే మొత్తము ఐదు గుంపులు. గుంపునకు నాల్గేసి పంక్తులు అడ్డముగాను, నాలుగు వరుసలు నిలువుగాను ఉన్నవి. ఒక్కొక్క పంక్తిలో ౧౬ స్వరభేదములు నాల్గు నాల్గుగా చేర్చబడి, నాలుగు వ్రాయబడినవి. వరుసల లోను ఇట్లే.

ఈశాసనములో తెలియని విషయములు చాల ఉన్నవి.

(౧) మొదటి భాగము పంచమగ్రామమునుగురించి. రెండవది షడ్జగ్రామము గురించి. తక్కిన ఐదున్ను ఒక్కొక్కటి ఒక్క జాతినిగురించి. వాటి పేర్లు క్రమముగా షాడవ, సాధారిత, పంచమ, కైశికమధ్యమ, కైశికలు. షాడవమని, పంచమమని పేర్లేగాని అందుపయోగించిన స్వరస్థానములు ఏడేసే. పేర్లకు కారణము తెలియదు. కైశికమధ్యమ యనుదానిలో ఆరు స్వరస్థానములుమాత్రమే ఉన్నవి.

స్త యను స్వరస్థానము స, సి, సు, సె యను నాల్గువిధముల నున్నది. ఇట్లే తక్కిన ఆరు స్వరస్థానములు నాల్గేసివిధముల నున్నవి. ర,రి,రు,రె; గ,గి,గు,గె ...యని. ఏడు స్వరస్థానములకు ౬ × ౪ = ౨౪ స్వరభేదములు. కాని కొన్ని స్వరభేదములు వాడలేదు. ఆరు భాగములందు ౨౨ జేసి భేదములు వాడబడినవి. V వ పట్టీ చూడుడు. ఇకి యను భేదము లెన్నడును వాడబడలేదు. వరుసగా ఒక స్వరస్థానమే వాడబడలేదు. వీటికి కారణములు నిశ్చయము కావలెను.

(౨) శాసనమందు వాడిన స్వరస్థానములు తొమ్మిది. కాని ఏభాగములోను ౪ కంటె ఎక్కువ వాడబడలేదు. గాంధార, నిషాదములలో రెండేసి స్వరస్థానములు గలవు. ఒక్కొకదానికి నాల్గు భేదములు. గాంధారస్థానమందు అ, ఇ, ఉ, ఎ లు గాని, గ, గి, గు, గె లు గాని వాడబడినవి. నిషాదస్థానమందు న, ని, ను, నె లు గాని, క, కి, కు, కె లు గాని వాడబడినవి అ అనగా అంతరగాంధారమని, క అనగా కాకలి నిషాదమని రావుబహద్దరు భండార్కరుగారి అభిప్రాయము. ఎపిగ్రాఫియా ఇండికా వాల్యూము ౧౨ ౨౭-౩౬ పేజీలలో ఈశాసనమును ప్రప్రథమముగ వారు ప్రకటించి వివరముగా చర్చించినారు. తరువాత డాక్టరు మీనాక్షీగారు Administration and social life under the Pallavas అను పుస్తకములోని ౨౩౯-౨౬౫ పుటలలో మిక్కిలి సామర్థ్యముతో చర్చించినారు. ఆ మెకూడ అంతరగాంధారమని, కాకలినిషాదమనియే చెప్పవచ్చునన్నారు. కాని ఒక చిక్కు కనిపించుచున్నది. అంతరగాంధారము గాంధారములోని నాల్గు భేదములలో ఒకటి యైయుండగా అందింకను నాల్గుభేదము లనగా నేమి యర్థము? ఇట్లే కాకలినిషాద విషయముకూడ. ఈ భేదముల స్వరూపమెట్టిది యను ప్రశ్నకు సరియైన సమాధానము తేలినగాని ఈచిక్కు విడదు. ఈవిషయమున భండార్కరుగారొకతీరున, మీనాక్షిగారొకతీరున అభిప్రాయపడినారు.

భండార్కరుగారు—

"చతుష్ప్రహార స్వరాగమాః అనుటచేతను, హల్లునకు అ, ఇ, ఉ, ఎ లు చేర్చి సాంకేతికములు (చతుః) నాల్గు వాడుటచేతను, వీణతీగను నాల్గువిధముల వాయించుటచేత కలిగిన స్వరభేదములనియే ఈ సాంకేతికముల కర్థము చెప్పవలెను. సంగీతరత్నాకరమందలి పుట ౪౧౫ చూడుడు" అన్నారు. కాని వివరమేమియు చెప్పలేదు. రత్నాకరము చదివిచూడగా తేలిన విషయ మిది: "ప్రహారవిశేషమున వీణయందు పుట్టిన స్వరభేదములను ధాతువు లందురు. అవి నాల్గువిధములు. అందు అంతరభేదము లున్నవి. విస్తారజ, సంఘాతజ, సమవాయజ యనునవి మూడు అంతర్భేదములు. విస్తారజనుగురించి ఇట్లు—

"విస్తీర్ణ నాదభేదత్వాత్ విస్తారో ధాతు రుచ్యతే
ప్రహారలాఘవా త్కృత్వా స్వరా నేకీకృతానిక"

ప్రహారలాఘవమునుగురించి – "వాదకే హస్తలాఘవా దిత్యర్థః" అని వ్యాఖ్యాత. "విస్తారజకే ఏకవిస్తారజ మని కొందరందురు. సంఘాతజభేదములు ద్విప్రహారభవములు. సమవాయజభేదములు త్రిప్రహారభవములు" దీనివలన ఏకవిస్తారజ (ఏకప్రహార?) ద్విప్రహార, త్రిప్రహారభవములు (ఆగమనులు) వీణావాయిద్యమందలి (ధాతు) భేదములని స్పష్టమగుచున్నది. కాని చతుష్ప్రహారమును గురించి చెప్పబడలేదు. ఐనను నాలుగు స్వరభేదములు నాల్గు ప్రహారభేదముల (కొట్టు, మీటు, జారు, లాగు?) చేత కలిగినవని ఊహించుటకు కారణము లేకపోలేదు. ఒకస్వరమునే నాల్గువిధముల పలికించుటనుగురించి ఈసాంకేతము లుపయోగింపబడెను కాని, ఒక స్వరస్థానమందలి నాల్గు శ్రుతుల భేదములను గుర్తించుటకై కావని భండార్కరుగారి యభిప్రాయము. సంగీతసుధయందు గోవింద దీక్షితులు ర, రి, రు, రెలు మొదలైనవి ఆయా స్వరస్థానములలోని శ్రుతిభేదములకు వాడినాడు. మహేంద్రవర్మ వాడిన దిట్టి సంకేతములను దెల్పుటకై కాదు అని భండార్కరుగారు స్పష్టముగా వ్రాసినారు. కారణములను స్పష్టపరచలేదు. కాని కారణము పైన సూచించినరీతి నిట్లు కావచ్చును. గాంధారమునకు శ్రుతిభేదములు నాల్గేగదా, గ, గి, గు, గె; అ, ఇ, ఉ, ఎ అను ఎనిమిదింటిని సమర్థించుట ఎట్లు? ఇట్లే

నిషాదస్థానమందు న, ని, ను, నె; క, కి, కు, కె అను వాటిని సమర్థించుట ఎట్లు? దీనికి సమాధాన మేమియును కనిపించదే, దీనికి అర్థము లేదే యని చెప్పవచ్చును.

మరియు, శాసనమందలి <u>స</u> <u>రి</u> <u>మ</u> <u>ప</u> <u>ధ</u> లు ఐదు స్వరస్థానములు శుద్ధములు, అన్ని భాగములయందు వాడబడెను. తక్కిన రెండింటిలో శుద్ధగాంధారమో, అంతరగాంధారమో, మరియు శుద్ధనిషాదమో, కాకలి నిషాదమో వాడబడెను. ఈ ఏడు భాగములు ౭ గాని, ౬ గాని స్వరములుగల స్వరమేళములు—జాతులు. వాటిని గానమునం దుపయోగింతురుగాన రాగము లని అనవచ్చును అని భండార్కరుగారి వాదము. దీనికి భరతుని నాట్యశాస్త్రమందుండి ప్రమాణము కలదు.

"ముఖేతు మధ్యమ గ్రామః షడ్జః ప్రతిముఖే తథా,
గర్భే సాధారితశ్చైవ హ్యవమర్శేతు పంచమః.
సంహారే కైశికాః ప్రోక్తాః పూర్వరంగేతు షాడవః,
చిత్రస్యాశాదశాంగస్య త్వంతే కైశికమధ్యమః."

మతంగుడు బృహద్దేశియం దిట్లు భరతుని ఉదాహరించెను. నేటి భరతశాస్త్ర ప్రతులయందు కించిద్భేదముగా ఉన్నది.

"యత్కించిద్గీయతే లోకే తత్సర్వం జాతిషు స్థితమ్"

భండార్కరుగారి వాదమునకు వ్యతిరేకముగా అంతరగాంధార, కాకలినిషాదముల గురించి కొంత చెప్పవలసియున్నది. సంగీతరత్నాకరమందు ఈరెండున్ను దుర్బలములని - అనగా అల్పప్రయోగము కలవని చెప్పబడియున్నది. అనగా, షడ్జస్వరముతో ఈరెండును ఒకసారే పలికించినప్పుడు అనువాదము (harmony) అంతగా లేదని యర్థము. III పట్టికలో చూపించినట్టు తరచుతనపు రెట్లు $\frac{౮౧}{౬౪}$, $\frac{౨౪౩}{౧౨౮}$ ఐయుంటే అట్లనుటకు వీలులేదు. గానరత్నాకరకాలమునకు వీటి తరచుతనపురెట్లు ఇవి కావని చెప్పవలయును. ఈరెండింటినిగురించి చెప్పుచు రామామాత్యుడు స్వరమేళకళానిధిలో ఇవి వాడుకనుండి క్రమముగా తొలగిపోయిన వని చెప్పి, వాటికి స్థానములను నిర్ణయించుచు అంతరగాంధారమును చ్యుతమధ్యమగాంధారముగాను ($\frac{౩౨౦}{౨౪౩}$), కాకలినిషాదమును చ్యుతషడ్జనిషాదముగాను ($\frac{౧౬౦}{౮౧}$) స్థిరపరచినాడు. కాని వెంకటమఖికాలమునాటికి మధ్యమషడ్జముల కంటె ఒక శ్రుతిమాత్రమే కాక రెండు శ్రుతులు తక్కువగా స్థిరపడిపోయినవి. $\frac{౪}{౩} \times \frac{౮౦}{౮౧} = \frac{౩౨౦}{౨౪౩}$; $౨ \times \frac{౮౦}{౮౧} = \frac{౧౬౦}{౮౧}$ ఇట్లే నేటికిని వాటి నిర్ణయము. గాన ఈఅంతరగాంధార, కాకలినిషాదముల శ్రుతిప్రమాణములు రత్నాకరముకంటె కొంత ప్రాచీనకాలమునుండి వెంకటమఖికాలమువరకు సునిశ్చితములు కాలేదని తేలుచున్నది. ఈశ్రుతిభేదవిషయముగురించి ఈశాసనమునందుకూడ సాక్ష్యము కనిపించుచున్న దని మన మూహింపవచ్చును. అ, ఇ, ఉ, ఎలలో ఇ శాసనమందు వాడబడియుండలేదు. ఇట్లే క, కి, కు, కెలలో కి వాడబడలేదు. అనగా అంతరగాంధార, కాకలినిషాదములలో మూడు శ్రుతిభేదములు మాత్రమే గుర్తింపబడినవి. నేటి సంగీతమందుకూడ అంతరగాంధార, కాకలినిషాదస్థానములలో తప్పక మూడు భేదములు కలవనుట సుప్రసిద్ధవిషయమే. కళ్యాణి, శంకరాభరణము, సావేరి రాగములయందలి అంతరగాంధారములు మూడున్ను భేదములు. కళ్యాణిలోనిది చ్యుతమధ్యమగాంధార మనవచ్చును. ఇట్లే కళ్యాణి, శంకరాభరణము, భైరవి రాగములలోని కాకలినిషాదములున్ను భేదములు. కళ్యాణిలోనిది చ్యుతషడ్జముగా భావింపవచ్చును. దీనినిబట్టి ఈశ్రుతిభేదములు మహేంద్రవర్మకాలమునాడు బాగుగా గుర్తింపబడినను, రానురాను అస్పష్టములై మరుగుపడిపోయి దుర్బలము లనిపించుకొని తిరిగి వెంకటమఖికాలమునాటి పూర్వస్థితిలోనికి ఉద్ధరింపబడిన వని చెప్పవచ్చునేమో.

మీనాక్షిగారు—

ర, రి, రు, రె మొదలైనవి శ్రుతిభేదములు. ఒక స్వరమునే వ్రేళ్లువిధముల వాయించుటచేత కలుగు ధ్వనిభేదములు కావు. శాసనములో ౭ భాగములయందు ౨౨ స్వరభేదములు చూపబడినవి. శ్రుతుల సంఖ్య కూడ ౨౨ యే. మహేంద్రవర్మచేత వాడబడిన సంకేతములు మూలపడిపోగా వాటిని గోవిందదీక్షితులు వాడుకలోనికి తీసికొనివచ్చెననుటయే న్యాయము. వినుట కింపుగా నుండునని వీణమీద వాయించిచూచి,

సంగీత మభ్యసించు శిష్యులనిమిత్తమై గురువను రుద్రాచార్యులవారి యాజ్ఞానుసారముగా శాసనమును తాను చెక్కించినట్లు మహేంద్రవర్మ ఈశాసనమునను, మరియొక శాసనమునను స్పష్టపరచియున్నాడు. గాన నాల్గేసి స్వరభేదములను జేర్చి ఒక్కొక్క సంగతి (musical phrase)గా, వీణమీద రక్తిగా వాయించుటకై ఈ చతుష్ప్రహారస్వరాగముల చెక్కించె ననుటయే సందర్భము. ఒక్కొక భాగమందు — అనగా షడ్జగ్రామము మొదలైనవాటియందు ౨౨ శ్రుతిభేదము లుండుటచేత వీటిని రాగము లనిగాని, తత్తుల్యములగు జాతులనిగాని చెప్ప వీలులేదు. ఈ వివిధస్వరాగమములనుండి తరువాతివారు వారియిష్టానుసారముగా రాగములను కల్పించుకొనుటకై యుపయోగించియుండవచ్చును. ఇది మీనాక్షిగారి వాదము. షడ్జగ్రామము మొదలైనవి రాగములుగా భావించరాదను విషయ మొక్కటిన్ని ఈవాదమందు దుర్బలముగా యున్నట్లు కాన్పించుచున్నది.

(౩) న్యాసస్వరములు—గుంపులు. ప్రతిగుంపులోనూ నాల్గుగా నున్న స్వరభేదములలోని చివరస్వరము ఒకటే. అనగా ప్రతిగుంపుయందు* న్యాసస్వర మొకటే. ఎన్ని స్వరములు న్యాసస్వరములుగా ఉపయోగించవచ్చునో అన్ని గుంపులుమాత్రమే భాగమున నున్నవి. కొన్నింటిని న్యాసస్వరములుగా నుపయోగింపకుండుటకు కారణము తెలియదు. గుంపులయందలి న్యాసస్వరముల వరసను పరిశీలించగా స, రి, గ, ప, ధ, ని, మ యను వరుసగా కనపడుచున్నవి. అన్నింటికిని ఆకరి గుంపులోని న్యాసస్వరము మ యే. ఎందుచేతనో తెలియదు.

(౪) కొన్ని అక్షరములమీద చుక్కలొట్టు పెట్టబడియున్నది. భండార్కరుగారు ఇదేమో తెలియుట లేదని వ్రాసినారు. అది అంశస్వరమునకు గుర్తు అని మీనాక్షిగా రూహించినారు. గ్రహ అంశ న్యాసములు ముఖ్యముగ మూడు లక్షణములు. అందు రెండు స్పష్టమే గాన మూడవదానిని తెలుపుటకీగుర్తు అనుట బాగానే ఉన్నది. కాని కొన్ని స్వరాగమములలో అంశస్వరము కానరాదు. కొన్నింటిలో నాల్గు అంశస్వరములే. మరియు ఈ చుక్కలు గల స్వరభేదములే సంప్రదాయములైన జీవస్వరభేదములని నిశ్చయమగువరకును ఈయూహ తృప్తిని కలుగజేయనేరదు.

భరతుని నాట్యశాస్త్రకాలమునుండి ఈశాసనకాలమువరకు సంగీతమున గలిగిన పరిణామమును ఈశాసనమువలన కొంత గుర్తించవచ్చును. పైన కనపరిచిన సందేహములు, సమస్యలు పూర్తిగా విడిపోయినగాని ఈ పరిణామము స్పష్టపడదు.

సంగీతవిద్వాంసులు, వీణావాద్యప్రవీణులు కలసి పరిశీలించి ఈ విషయమును స్పష్టపరచుట ముఖ్యము, అవసరమున్నూ. * [సశేషము]

---

* ఈవ్యాసము తయారుచేయుటలో పుస్తకముల నిచ్చియు, నాగరలిపిని జదివిపెట్టియు, అర్థమును చెప్పియు, ఫలానాచోట ఫలానావిషయము గలదని చెప్పియు సాయము చేసిన శ్రీయుతులు వడ్డాది అప్పారావు, నరసింహయ్యంగారు, వేటూరి ప్రభాకరశాస్త్రి, పిలకా గణపతిశాస్త్రి, బి. లక్ష్మణరావుగార్లకు నాకృతజ్ఞతాపూర్వకవందనములు సమర్పించుచున్నాను.

# జూదం - బ్రాకెట్

= శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు =

●

[సభఎదట ఏవిషయం మాట్లాడ్డం నయం అని ఆలోచిస్తే-సభ, నయం అనే మాటలవల్ల 'జూదం' అనే మాట స్ఫురించింది. నాతోటి తెలిసీ తెలియనివాడికి 'జూదం' తగిన విషయం లాగే కనిపించింది. దాని పుట్టుపూర్వోత్తరాలూ, రకాలూ, ఫలితాలూగురించిన ప్రసంగం ఇది—౧౯-౧౨-౧౯౬౭]

జూదం అనేది యూరప్‌లో బి. సి. ౧౨౪౪ లో పెలోమిడిస్ అనే వ్యక్తి మొదట కనిపెట్టినట్టు ఉంది. ఇంగ్లండులో మొదట జూదం ఆడడం క్రీ. శ. ౧౫౬౯ లోట! మొన్న ౧౮౭౪ లోగాని టెన్నిస్ మొదలైన ఆటలుకూడా ప్రభుత్వామోదం పొందనే లేదుట. కాని, అంతకంటె వేలాది సంవత్సరాలు పూర్వమే, నలరాజుకాలం నాటికే, పాచికలు ప్రచారంలో ఉన్నట్టు మనం ఎరుగుదుం. సరి, ఇక మహాభారతకథ నాటికి (విధిగా రచనాకాలంనాటికి) జూదం భారతదేశంలో వన్నెకెక్కినట్టు తెలుస్తోంది. వేషం పిరాయించి అజ్ఞాతవాసంలో ఉన్నా ధర్మరాజుని జూదం వదలనేలేదనిన్నీ, అతడు విరాటరాజునికూడా అందులోకి దింపాడనిన్నీ, అతడు కోపంవచ్చి సారెతో ఇతణ్ణి కొట్టినప్పుడు రక్తం రాగా నిరంతరాలోచన చేసి, ధర్మరాజు, ఎంత గట్టిగా విసిరినాసరే మొహం రక్తంచిమ్మని పాచికలు సృష్టించి ద్యూతప్రపంచంలో గొప్ప పరిణామం తెచ్చి బిరుదుకొట్టాడనిన్నీ, ధర్మరాజే జూద పాటల్లో సరికొత్తరకాలు కనిపెట్టాడనిన్నీ అనద్యతనభూతకాలజ్ఞులు నొక్కి రాశారు. ఏపరిమాణంలో అయితేం, కాపట్యం ప్రమాణంగా తీసుగునిచూస్తే, జూదం—కిరికం, చరం, నయం అని త్రివిధంగా చెప్పవచ్చునన్నారు. ఇందులో మొదటిదే దుర్ద్యూతం అనీ, దురోదరం అనీ, మాయాద్యూతం అనీ అంటారు. (శకునివంటి అక్షవిద్యాపూర్ణుడు తను కాసిన సంఖ్య పడేటట్టు పాచికలు విసరగల నేర్పు చూపెట్టి మాయచెయ్యగలిగినప్పుడు!) వినోదమాత్రంగా ఆడే జూదాన్ని సుహృద్ద్యూతమనీ, 'నయం' అనీ అనవచ్చు. మిశ్రమవిశేషాన్ని, ఐశ్వర్యం చేతులు మారుతుందిగనక, 'చరం' అంటే బాధలేదు. కాని, ఆటసాధనాల్ని బట్టి చూస్తే, జూదం రెండురకాలే — ప్రాణిద్యూతం, అప్రాణిద్యూతం! ప్రాణిద్యూతంలో: వస్తాదులు, సింహాలు, గుర్రాలు, గొర్రెలు, కోళ్లు, పావురాలు, ఎడ్లు, మొనళ్లు, తాంబేళ్లు, పందికొక్కులు—ఇల్లాగ్గా ఉండవచ్చు. అప్రాణిద్యూతంలో: పాచికలు, పేట్లు, గవ్వలు, దశావతారీ, చదరంగం, చీట్లపేక, అక్షరాలు, అంకెలు—ఇటువంటివి కావచ్చు. ఆడేవాడు ఒడ్డే పణం ఏమిటయి ఉండవచ్చును? అంటే, రొఖ్ఖం, నగలు, ఇల్లు, పొలం, పెళ్లాం, పిల్లలు, తను—ఏదైనా సరే, పూర్ణంగా తనకి

హక్కున్నది— అయిదో వంతు హక్కు మాత్రమే తనకి ఉన్నా యావత్తు ద్రౌపదినీ ఒడ్డి ఆడిన ధర్మరాజుమోస్తరు కాకుండా! కాని, హింస లేని వినోదమే పరమావధిగా మానవులు మొదట ఇవి అభ్యసించినట్లు తెలుస్తుంది. ఇటువంటి వినోదాల నిమిత్తం పోగవుతూండే జనసమూహాన్నే మొదట్లో 'సభ' అని పిల్చేవారు అనికూడా అనుకోవచ్చు. వీటి అన్నింటిలోనూ కేవల కావ్యం, కేవల ధనాశామాత్రమేకాక, విజయ నిర్ధారణలో ఉండగల అనిశ్చితత్వం అనే అదృష్టం నక్కి ఉంటుంది. అదృష్టం అంటే సంభవనీయతలో ఆనుకూల్యం. ఒక క్రియ కోరినరీతిని భావికాలంలో జరగడానికి అదృష్టం, అది సంభవించడం ఎన్నిమోస్తర్లుగా జరగవచ్చునో అన్నోవంతు. ఒక గవ్వ విసిరినప్పుడు తిరగపడచ్చు, బోర్లపడచ్చు గనక, ఒకే విసురులో అది తిరగపడడానికి అదృష్టం సగం. పాచిక అనేది పలకల కడ్డీలా ఉండేదనిన్నీ, చివళ్లు శూన్యంగా ఉండి పలకల మీద మాత్రం ఒకటి, రెండు, మూడు, నాలుగు చుక్కలో, గుంటలో ఉండే వనిన్నీ ఎవరో చెప్పగా విన్నాను. అందుకని పాచిక విసిరితే అదృష్టం నాలుగోవంతు; నాలుగు ఒకేసారి విసిరితే అదృష్టం ౧౨౯౬ వ వంతు. పాశ్చాత్యుల పాచిక విసిరితే అదృష్టం ౬ వ వంతు. అందుకని, వచ్చిన స్థితి క్రమం మళ్లీ వెన్వెంటనే ఓపట్టాన రాకపోవడం, నూతనత్వంయందుండే మానవుల ప్రేమా మార్పుచెంది మరి రాబోయే నవ్య స్థితిక్రమం మనకి అనుగుణంగా ఉండకపోతుందా అని మానవులకి గల ఆశా, ప్రపంచంలో ప్రతీ సంభవమూ ఏదో సూత్రం మీద ఆధారపడి జరిగేటప్పుడు ఇందులో మాత్రం సూత్రం పోనుపోను ఏకాస్తో ఎందుకు దొరక్కపోతుంది, దానిప్రకారం చేసిన మన ఊహితం ఎందుకు రైటవదు అని ఆలోచించే మానవుల జిజ్ఞాసా, నాకంటె నీచాతినీచుడే అదృష్టవంతుడై నెగ్గినప్పుడు నేనుమాత్రం ఎందుకు నెగ్గిచూపించకూడదూ అని మానవుల్లో ఉండగల పైత్యమూ- ఇవి, మానవుణ్ణి ద్యూతరంగంలోకి మోసుగుని వెళ్లే వాహనాలు. ఆటలన్నింటిలోనూ నూతన స్థితు లుంటాయి గాని, పేకలో మిక్కిలిగా ఉంటాయి. చీట్లపేకలో ౫౨ ముక్కలు. వాటి నన్నింటినీ రానిస్తూ, వాటిని కోటాన కోట్ల వరసక్రమాల్లో పెట్టచ్చు. ఒకడు ఆ యాభై రెండు ముక్కలకీ తన యిష్టంవచ్చిన క్రమం ఒకటి ముందు చెప్పి, తరవాత చీట్ల పేక తీసుగుని, అవసరం అయినన్నిసార్లు వాటిని కలిపి, సరిగ్గా తను చెప్పిన క్రమంలో అవి ఉండడం చూపిస్తానని పందెం వేశాడట. ముక్కలు బాగా కలిపి చూశాడట, అతనన్న క్రమం రాలేదు. మళ్లీ కలిపిచూశాడట, రాలేదు. ఇల్లాగ్గా తక్కినవాళ్లు వెళ్లిపోయినా, ఒక్కడే కూచుని, నిజాయితీ మనిషి గనక, రోజుకి పది గంటల చొప్పున ఇరవైఏళ్లు కలిపి చూసి, మొత్తం ౮౭౮౩౦౨౯ సార్లు తంటాలు పడగా, అప్పటికి అతడి జోస్యం ఫలించి అతడు మొదట చెప్పిన క్రమంలో ఆ ముక్కలు కనపడ్డాయిట!

అలాగ్గా, పేకలో ఉన్నంత విరివిగా కాకపోయినా, సంభవించడానికి వీలైన మార్గాలు అనేకంగా ఉండడం పైన సూచించిన ప్రతీఆటలోనూ ఉంది. అందువల్లే, ప్రతీఆటలోనూ ప్రతీ పోటీదారుకీ నెగ్గ

డానికి కావలిసిన నలకంత అదృష్టమూ తనలో నివసించడానికి జాగా లేటుండదాయిరి, దానికి తోడు తన ప్రజ్ఞ ఉందాయిరి అనిపించిగావును, ఊహూ నెగ్గుతాననే ధైర్యంతప్ప, ఓడిపోతానేమోరా అనే అధైర్యం ఎంతమాత్రం చస్తే ఉండదు. కాబట్టి ద్యూతదీపాన్ని జనం వానపురుగులు ముసిరినట్టు ముసురుతారు. జనానికి అంత ప్రియం అయిందిగనకనే, దేశకాల పాత్రల్ని బట్టి జూదం రూపాంతరం పొందుతుందేగాని, జన్మాంతరంలోకూడా మానవుణ్ణి వదలదు, వదిలేటట్టు కనిపించదు. డబ్బూ చదువూ లేనివాళ్లు ఏగవ్వల్తోనో, ఏ'పులిజూజం'తోనో ఇదవుతారు. డబ్బుండి చదువులేనివాళ్లు ఎందులోనో సొమ్ము కాస్తూనే ఉంటారు. డబ్బుండి చదువూ ఉన్నవాళ్లు మహానగరాల్లో గుర్రాలమీద కాయడంలాంటి పన్లు చేస్తారు, ఇతరచోట్ల డబ్బెట్టి,అవసరం అయితే తలుపులు మూసుగుని పేకాడతారు. అయితే, డబ్బుండి, చదువుండి, తీరుబడి కూడా ఉండి, గ్రామాల్లోకూడా ఉండి, రిటైరైన ఉద్యోగులు లాంటివాళ్లకి సరిపడ్డ జూదం ఏమీ లేకపోయిందే, వీళ్లని దింపడం ఎల్లాగా అని గడసర్లు ఆలోచించి, ఆంగ్ల పత్రికలు సాధనంగా, ఆంగ్లపాండిత్యం నెపంగా ఆంగ్లాక్షరద్యూతం నిర్మించి సాగించారు. వాటిల్లో లాభం—అక్షరపథకాలు వేసినవాళ్లకీ, ఆ పథకాలు పడే పత్రికల వాళ్లకీ, ఆ పథకాలలో వచ్చే అక్షరాలు గల మాట లుండే ఆంగ్లనిఘంటువులు అమ్మేవాళ్లకీ! ఇక పోటీదార్లు? ఆంగ్లపాండిత్యం అందులో ఫలిస్తుంది అనుకునీ, అది జూదం కాదు పాండిత్యపరీక్షే అనుకునీ, ఆఅక్షరాలు తనకి తెలిసినవేగనక తన కోరిక తీర్చక పోతాయా అనుకునీ, ఆ కృషితో ఆంగ్లసారస్వతాభివృద్ధి అవుతుం దనుకునీ, కాలయాపనం అనీ, వ్యసనం అనీ, నాగరికత అనీ, నాయిష్టం అనీ సబబులు చెబుతూ; ఇది పడ్డ పేజీతప్ప తక్కిన పేజీల్లో ఏముందో శీర్షిక లేనా చూడనియ్యని కసిలో ఆనంచికలు కొంటూ; ఎన్ని సంభవనీయాలకి తను డబ్బు కాశాడో అనేది పబ్లీకుఅయితే తరవాత నామర్దా అని తనే పోస్టాఫీసుకి స్వయంగా వెళ్లి రహస్యంగా కాస్తూ; ఓడిపోయినప్పుడు తన కామాట ముందే తెలుసునని అర్థంలేని కారణం చెబుతూ; ఒకవేళ కొంతభాగం నెగ్గితే ఆఫలితం ఒకటీమాత్రమే తను కాసినట్టు కోస్తూ; విజయాతురం తను వెయ్యకపోయి ఓడినా అదే తను మొదట వెయ్యనిశ్చయించుగుని మానేశానని సమర్థించుగుంటూ; తన ఓటమి విజయానికి ఎంతో దగ్గిర అని ఆశపడుతూ; చింతాకు వాసిగా నుయ్యిదూకినట్లు పనిచూపెడుతూ; మరణం జీవితాంతంలో జీవితాన్ని స్పృశిస్తుందిగనక మరణించినవాడు సజీవుడికి చాలాదగ్గిరే అనుకోగలిగిన తత్త్వదృష్టితో; ఆంగ్లాక్షరద్యూతం ఆడి, ఓడి, మాడిన ఆంగ్ల విద్యాధికాంధ్రులు దేశంలో తూకంగానే కనిపిస్తారు. ఇంగ్లీషుపత్రికలకి ఈ ఎత్తుతో ధనం కురియడంవల్ల పులిని చూసి నక్క గనక, తెలుగు పత్రికల్లోకూడా ఆంధ్రాక్షర ద్యూతపథకాలు పడుతోచ్చాయి, తన్నిమిత్తం నగరాల్లో సంఘాలు లేస్తోచ్చాయి. సరి, కాగితపుకాటకం ఓటి అదనంగా మీద పడగా, ప్రతీ ఆంధ్రవ్యవహారంలాగే, ఆంధ్రాక్షరద్యూతాలు జండా దింపేశాయి. ఈ

అక్షరాల్లోకూడా చిక్కుందని మరికొందరు ఆలోచించారు. ఏమంటే, భాషభాషకీ అవి వేరు. పైగా, ఆ కాసిని అక్షరాలూ తెలియని వాళ్లు కోటానకోట్లు. అందువల్ల, భూమి మీద కాస్త జీవం, కాస్త మతీ ఉన్న ప్రతి ద్విపాదుడూ ఆడడానికి తెలిసే ఆటవస్తువులు 'అంకెలు' అని వాళ్లకి తోచింది—అంకెలూ తెలియనివా డుండడు గనక! అంక ద్యూతం అఖిలభూవ్యాపారం కాగల చిహ్నాలు వాళ్లకి కనిపించాయి. వాళ్ల దూరదృష్టికి అనుగుణంగా: గమ్యం విశేషదూరం అయి నట్టు కనపడకుండా, ఒకటైతే పదోవంతూ, జత అయితే వందోవంతూ అదృష్టం కలిగి, భూమానవుడికి ప్రతివాడికీ అందుబాటులో ఉంటూ, తెస్తే చాలా ఒకేసారి తెస్తూ, పోతే కొంచెంకొంచెం చొప్పున, కనపడకుండా ఉండే నష్టం కలిగిస్తూ, కష్టం ముష్టి బదులు చేబదులు విక్రయం బహుమానం వంటి ఏ బాపతు ఏసొమ్మయినా, ఎంతైనా సరే, ఏ దేహీ అయినా సరే, కాయడానికి వీల్లు కల్పించి, గ్రామాలలోకికూడా అవతరించిన జూద పాట ప్రస్తుతం 'బ్రాకెట్' ఆట! ఈ అప్రాణి ద్యూతంలో ఆట సాధనా లైన అంకె లేవీ అంటే, న్యూయార్క్ కాటన్ మార్కెట్టులో రాబోయే దినారంభ దినాంత ధరల్ని సూచించే సంఖ్యల ఒకట్ల స్థానంలో వెలవగల అంకెలు! ఆడడానికి అర్హత అక్కర్లేదు, అడ్వాన్సు అవసరం లేదు, ఆటంకం ఉండదు, ఆలస్యం అవదు, పణం కాసీ చాలు— చిల్లర దొరక్కపోతే చెప్పలేం కాని! ఓపెనింగ్ (ఆరంభధర అంకె) కాసి రైటైతే ౭ రెట్లు, క్లోజింగ్ (దినాంతధర అంకె) కాసి రైటైతే పణానికి ౮ రెట్లు, (రెండూ) బ్రాకెట్ కాసి రైటైతే ౬౦ రెట్లూ తక్కువ కాకుండా మర్నాడు చేతులో వేసే మధ్యవర్తు లుంటారు. పైగా "సమయానుకూలముగా (కట్నపు) రేట్లు హెచ్చింపబడును." ఒకసారి పట్టింపు వచ్చి బ్రాకెట్‌కి ఓ ఊళ్లో ౧౦౫ రెట్లు ఇస్తా మన్న వాళ్లున్నారు. రెండువరస రోజుల బ్రాకెట్లు కాసి రైటైతే వెయ్యి రెట్లు ఇస్తారట! వారం రోజుల వరస బ్రాకెట్లు హోమాటే కాసి అవిగనక అన్నీ రైటైతే, కాసింది ఎంతైనా సరే, ప్రతిఫలంగా ఇండియా ఇచ్చేస్తాడట ఒక బొంబాయి ఏజెంటు!— దాంతో స్వరా జ్యం పూచీ ఒక్కడి చేతిలో పడుతుంది. ఇక, ఒక నెలరోజుల వరస బ్రాకెట్లన్నీ ఒక్కగుక్కనే కాసి, అవన్నీ కాస్తంత రైటైనాయా, నెగ్గినవాడికి భూమిచ్చేసి, కొస రుగా భామున్ని కూడా ఇస్తారుట!! ఆదెబ్బతో యుద్ధాలు లొంగిపోతాయి, భాముడు దాసు డవడంవల్ల. మరేంలేదు, ఇందులో రా బోయే లాభాల లెఖ్ఖలు అల్లా లేచిపోతుం టాయి. ప్రతిదినఫలితాలూ మర్నాడు బొం బాయిమీదుగా వచ్చేస్తాయి. ముట్టవలసిన వాళ్లకి సొమ్ములు సాధారణంగా ముట్టిపోతా యి. అటువంటి అంకద్యూతం ఇంట్లో ప్రాణం మీదికి వచ్చినా, ఎంత చిక్కులో తనున్నా ఆడి, సాధారణంగా నష్టపోయి చెప్పుగోడా నికి వీల్లేక గంభీరంగా లోపలలోపల కుళ్లినా అనుభవించి, ఆస్తిఅంతా పోగొట్టుకున్నవాడి కంటె తన పని నయం గనక ఆట మానలేని బ్రాకెట్ దాసులు రాత్రిం పగళ్లు ఊరూరా బజార్లనిండా దొరుకుతారు. వాళ్లు తమ జాగ్రత్ స్వప్నావస్థలో బ్రాకెట్లని గురించి

ప్రకటిస్తూండే భావాలు వరసని గుచ్చితే, ఈ క్రింది చతుష్కం ఏర్పడుతుంది :—

I కొత్తగా ఓడినవాళ్ల చెదిరింపులు

హా ! నేటి బొంబాయి చెల్లిగ్రామా ! నిన్ను తెగ్గోసినా పాపం ఉందా ! ఓసీ నేటి ఓపెనింగ్ ! నీనోరు నొక్కిరిగదే ! అయ్యో నేటి క్లోజింగ్! నీకళ్లు మూసుకు పోయాయా! పోనీ, నేటి ఓ బ్రాకెట్ దంపతులారా! మీది జన్మేనా అని అడుగుతా ! విడివిడిగా గాని, జమిలిగాగాని మీకు సిగ్గులేదే! మీకు 'అరేబియా అంకెలు' అని పేరుండడంవల్లే ఆ అరేబియా దేశం నాటికీ నేటికీ ఎడారిగా ఉండిపోయింది. మీరు ఎల్లానూ సరిగా ఉండరు, పోనీండి. నేటి కాలానికి సున్న అనబడే శూన్యానికికూడా విడిగా గణ్యత బయల్దేరుతోందే! మీపదిమందీ చేరి నాదశ మారుస్తారుట్రా! విడిఅంకెలతో పదేపదే పోరినా, అంకెజతలతో శతవిధాల మొత్తుకున్నా, నే కోరినప్పుడు మీదర్శనమే కరువైపోతోందే! నాచోటికి సమీపంలోనే ఉండి, ముందు నాకు ఉషార్ ఇచ్చి, నాఆస్తి తగులడుతూంటే, మీరు క్షేమంగా తప్పిగుంటారా? ఏక తాపత్రయంతో, రెండో పని మాని, ముప్పొద్దులా, నలుగుర్నీ వాకబు చేస్తూండి, పంచప్రాణాలూ ఈపనిమీదే పెట్టుగుని, ఆరువారాలూ ఏడ్చి, అష్టకష్టాలూ పడి, పోనీ చెమటోడ్చకుండా, చిటికెలో నవనిధులూ ఒళ్లో పడతాయనుకుంటే, సున్నప్పిడతా నాకు ఎదురుగుండా రావలిసింది!! ఆశకీ, ఫలితానికీ ఇంత వ్యత్యాసమా? నాకుగనక కోపం వచ్చిందంటే, మీపదింటికీ దశావాం చేసేసి, గోదావరి ఎండిపోకముందే మిమల్ని అందులో ఊరదొక్కేస్తాను. ఇహ మిమల్ని ఎవరెంత సంస్కరించినా మీమచ్చ మాయదు. దాంతో భూమిభూమంతా అసంఖ్యాకం అయిపోతుంది. ఆపళంగా బ్రాకెట్లు ఆడడానికి అంకెలు దొరక్క జనం చచ్చి ఊరుకుంటారు—వాళ్ల లెఖ్ఖ తేల్చడం వీల్లేక ఇంకా పోతారు. ఈసారి నే కాసిన అంకె ఇతరపని మాని వెళ్లి ఎల్లానో ఆ బొంబాయి చెల్లిగ్రాంలో ఇరుక్కుని మర్నాడు ఈపూరొచ్చెయ్యాలి! కబడ్దార్ !

II ప్రశ్నయాపెట్టి నెగ్గదలచినవాళ్ల
కొంతెమ్మ కోరికలు

మొదట్లో ఒకసారి ఇట్టే వెళ్లి ౪-౭ కాశాను. తక్కిన నెగ్గాను—గన్‌షాట్ ! కాసింది అర్ధణా. ౯౦ అర్ధణాలు లాగేశాను. నాజన్మాంతరం కాకపోతే ఆవేళే ఓ వంద రూపాయలు కాసిఉండకూడదూ! మరి తరవాతనించి తిరోగమనమే. అయినా, నాకు భయంలేదు. అటువంటప్పుడు నేను పగలు కనిపించను. కర్మం జాలక నెగ్గితే, దప్పేస్తాను. వతనదార్లకి, ఓడినా నెగ్గినా తేడా క్రమేపీ శూన్యం అవుతుంది. నేను మిక్కిలి తరుచుగా ఓడిపోయినా, నెగ్గే అంకెల జతకూడా పొద్దుణ్ణించీ నేను అనుకునే ఉండిఉంటాను, అదే కాయాలని స్థిరపరుచుగునికూడా ఉండి ఉంటాను. ఉంటేం, ఎవరో శనిలాగ చక్కా వచ్చి (అనగా, మా అమ్మో, నాభార్యో, నాసంతానమో, నానౌఖరో, నాఇరుగుపొరుగో—అంతా ఒకరు కాసినట్టు తెలియకుండా ఇంకోరు కాస్తారుగాదు మరీ !) నా మనస్సులోని రైటుజత నాచేత మానిపించి, ఎవడో చదువుకున్న ఓ గొప్పవాడు కాసిన జత అంటూ ఓ దిక్కుమాలిన జత

పట్టుగొచ్చి, నన్ను డబాయించి నాచేత కుడా అదే కాయింపిస్తారు. మర్నాడు సమిష్టి క్షౌరం- వైపెచ్చు, మాలోమాకు మాటలు కుడా పోవడం!... అట్టట్టట్టట్టే!... అదుగో 3-౬ నన్ను వెక్కిరిస్తోంది, వెనకటి సంగతి జ్ఞప్తికి తెస్తూంది. ఒకసారి భూతద్దంతో 'షాప్' కుడా పరిశోధించి ఆర్జించిన ప్రజ్ఞతో కాశాను. అందులో ఓ కంటితో చూస్తే 3, ఓ కంటితో చూస్తే ౬ దొరికాయి! నాకు 3-౬ తోచింది! నా పుట్టిన తేదీ అంకెలన్నీ కలిపేశాను, 3౬ వచ్చింది! నాకు 3-౬ మీాద భక్తి కుదిరింది. బ్రాకెట్ వేసే తేదీ అంకె లన్నీ కూడేశాను, 33 వచ్చి ఊరుకుంది. సాత్విక రాజస తామసాలు 3 గనక, అమూాడూ దానికి ఇట్టే కలిపాను, తంగున 3౬ వచ్చింది! ఇంకా, ఆవారంలో నెగ్గిన బ్రాకెట్ల జత లన్నీ కూడి, క్రమం తప్పించకుండా, 3 చేత భాగించి ౬ తీసేశాను, 3౭ వచ్చింది దీని మొహం ఈడ్చా! సరి, దేవు డంటే ఒకటి గనక ఆ ఒక్కటీ చప్పున ఇందులోంచి తీసేసరికి, చిత్ర మవుతుంది, 3౬:ఎవడికోసం-చచ్చినట్టు వచ్చింది. స్థిర పరిచాను. మూాడింటికి బయల్దేరి, ఆలస్యం చేస్తూ ఆరుగంటలదాకా నడిచివెళ్లి 3-౬ మీాద 3౬ రూపాయలు కాశాను. పైన చెప్పబడ్డ అన్ని వేరువేరు సంగతులూ ఏకీభవించడం దానంతటదే జరిగింది గనక నాపని మూాడు పువ్వులూ ఆరు కాయలూ లాగ ఉంటుందన్నాడు ఒక స్నేహితుడు. ఇంకోడు 3౬ కి ౯౦ రెట్లు ఎంతవుతుందో రెండు పంక్తుల్లో గుణించి, నాకు రాబోయే సొమ్ము లెక్ఖకట్టిపెట్టాడు. కొందరు నన్ను తక్షణం ఐరన్ సేఫ్ కొనెయ్య మన్నారు.

ఇంటి కొచ్చేటప్పుడు ఏకంగా ఆపనీ చూడచ్చన్నాను. ఆ రాత్రి ప్రసంగంలో, ఆ రాబోయే డబ్బెట్టి నేను న్యూయార్క్ వెళ్లి హుజూర్లో నే బ్రాకెట్ ఆడతానన్నాను. మావాళ్లు (స. రా. నాభార్య) వద్దన్నారు. 'షటప్' అన్నాను నేను. అని, ప్రపంచంలో నాలాంటి బ్రాకెట్ పీరుల జీవితమరణ చరిత్రలు కనుక్కొని రాసి అచ్చువెయించి బ్రాకెట్ పరాజితులకి ఉచితంగా పంచిపెట్టిస్తా నన్నాను. మావాళ్లు భుక్తి గడిస్తే చాలన్నారు. 'మరి నోరు తెరిస్తే గడవదు' అన్నాను నేను. పైగా, నాభార్యకి నగలు చెయించకమాననని ప్రత్యక్షంగా పైకి సత్య ప్రమాణిక్యం చేశాను. మావాళ్లు దైవభక్తి ఉంటే చాలన్నారు. అసలు బ్రాకెట్ అంటేనే ద్వైతాద్వైతసారమనీ, పరమాత్మ జీవాత్మయోగమనీ, ప్రప్రథమంలో అసలు సాంఖ్యయోగం అంటే ఇదే అనీ హడలేసి ఉపన్యసించేసరికి మాఆవిడ నావిజ్ఞానానికి ఏమీా అనలేక కళ్లుమూసుగుని, తలవంచి, లెంపలేసుగుంది. అయినా నే నాగలేదు. ఓపెనింగ్ అంకె తెలుసుగుని దానిమీాద లోగడ ఏయే క్లోజింగులు నెగ్గాయో చూసుగుని కాసేవాళ్లు బ్రాకెట్ పీరుల్లో జమరారనీ, ఉజ్జాయింపుగా ఎనిమిది అంకెలమీాద ఎనిమిది క్లోజింగులు బనాయించి ఏ కానికాని చొప్పునో ఆ ౬౪ జతలమీాదా కాసి, ఎదో ఓటి తగిల్తే పెట్టుబడికి ఆట్టే దండగ లేదుకదా అని వ్యవహారించే పిసినిగొట్లవల్ల బ్రాకెట్ ఆటకి అప్రతిష్ఠ అనీ, నెగ్గినమర్నాడు 'రివర్స్' ఆడి విశ్రాంతికోసం తంటాలుపడేవాళ్లు దమ్ములేని బ్రాకెట్ భీరులనీ, శుక్రవారం మాత్రమే ఆటకి వచ్చి లోగడ నెగ్గిన అంకెల

మొత్తాల చివళ్లు కాసేవాళ్లు బ్రాకెట్ ఆటలో వారాలు చేసుగునేవాళ్లనీ, ఒకనాటి ఆది రెండవనాటి అంతానికీ, మొదటినాటి అంతం రెండవనాటి ఆదికీ కలిపి కాసేవాళ్లు తిర్యక్కులనీ, ఆస్తి శూన్యం అయినానరే ప్రారంభించిన అంకె ఏదైతే ఉందో అది కాస్తూండడమే మగతనం అని గ్రహించిన ఏకాంకవ్రతస్థులు కలియుగ నలరాజులనీ, బ్రాకెట్ విషమించగా విషమించగా ఆసుపత్రిదర్శనం చేసేవాళ్లకి బ్రాకెట్ సంఘాలు పింఛను పంపుతాయనీ, నగలమ్మి బ్రాకెట్ ఆడే బోడులైన పూబోడులకి మంగళహారతి ఇప్పిస్తాననీ, నా రాబోయే డబ్బుతో ఆలిండియా బ్రాకెట్ కేంద్రభవనం నిర్మించటానికి స్థలం దరఖాస్తు చేస్తాననీ, బ్రాకెట్ పాపర్ల గురించి క్షేమనిధి పెడతాననీ కూడా ధారాళంగా తెలిగించి మాఆవిడతో చెప్పేశాను. మర్నాడు ఫలితాలు వచ్చాయి. ఆ రెండంకెలేకాని, ౬ మొదట వచ్చింది, 3 తరవాత చచ్చింది. ఆ అంకెల క్రమం రైటో కాదో, ఒకవేళ కానిరోజులుగనక టెల్లిగ్రాంతీగెలు తిరగబడ్డాయేమో, అవతల వాడు పుర్రచేత్తో కొట్టాడేమో అని అనుమానించి, పోనీ పేపరుకూడా చూద్దాం అనుకున్నాను. సరి, అదీ అల్లానే ఉంది. వెధవపేపరుగదే, అనుకున్నాను తీరిపోయింది! కాని, ఒక్క బాధమాత్రం పట్టుకుంది. ఒకానొక దిక్కుమాలిన కుంక ౬-3 మీద వంద కాశాట్ట! వాడు నాకంటె అధమాధముడూ, అల్పుడూనూ. నేను మిక్కిలి తరుచు ఓడుతూండడం మామూలు గనక నేనీసారి కాసింది కనుక్కొని, వాడు దానికి విరుద్ధక్రమంలో కాసి నెగ్గాడని నాకు తెలిసిన దగ్గిర్నించీ నాకు ఒళ్లుమండిపోతోంది. వాడికి రావలిసిన సొమ్ము వాడికి దక్కకుండా ఉంటే వెంకటేశ్వర్లుకి ఓ శేరు (ఆవునెయ్యి మానేసి – రోజులమహిమని బట్టి) కిరసనాయిలుదీపం వెలిగిస్తానని మొక్కుకున్నాను! దాఖలా కనిపించింది. ౯౦ రెట్లు ఇస్తాను అన్న బ్రాకెట్ ఏజెంటు తనూ, తన గాండీబలగమూ, తన పెట్టీ, తన నిత్య బ్లాకౌట్ కొట్టుతో సహా పెనుచీకటిలో అంతర్ధానం అయిపోయాడట! 'ఆరు-మూడు' వాడు మతిపోయి తిరుగుతున్నాడు! నాకు విరుద్ధంగా కాస్తే ఏమవుతుంది మరీ!

### III కృషిచేసి నెగ్గదలచినవాళ్ల నిరాశ

నా బ్రాకెట్ యథాప్రకారంగా పోతూనే ఉంది. నా ఆస్తి క్రమేణా క్షీణించింది. అందువల్లే బ్రాకెట్ గతి అయింది. ఆ ఆశే పెరిగిపోయింది. ఏం చేస్తున్నానో నాకే తెలియడం మానేసింది. ఆస్తి భీదాగా అంతరించగా, అరువులో పడి అద్వైతంలో పడి క్లోజింగుమాత్రం ౫, లేక ౨, లేక శూన్యం వేసి చూశాను. ఆద్యంతాలకి ౫ తేడావేసి చూశాను. ఖర్చులో ఖర్చు జ్యోతిష్కులకిచ్చి చూశాను. సలహాదార్లకి కమీషను అడ్వాన్సుగా ఇచ్చిచూశాను. గ్రహచార తిథివారాలు గమనించాను. అమావాస్యకి సున్న వేసి చూశాను. పూర్ణచంద్రోదయ సమయంలో ౮ ఆడి చూశాను. పిల్లలచేత అంకెలు తీయించి వేస్తోచ్చాను. ఏమట చెయ్యనియ్యండి, 'ఎంతట తన్నుకోసిండి, నే అన్న అంకెకే, మర్నాడు వచ్చే అంకెకీ సాయుజ్యం ఉంటుందేకాని, తాదాత్మ్యం ఉండదే! దాంతో, కనపడని అదృష్టం మీద లాభంలేక, కనపడే అంకెలమీద

ఎక్కడలేని కోపం వస్తుంది. వచ్చి వాటిని మాత్రం ఎంచెయ్యనూ! అవీ ఇదివరకే శల్యాలులాగ ఉన్నాయి. ఏదో శాపం తిన్నమీదటే వాటికి వాటి ప్రస్తుతరూపం వచ్చిఉంటుంది, నేను మళ్లీ వీటిని శపించడం ఎందుకు? వీటికి శాపంపెట్టి ఆట మానేసిన మాపూర్వసోదరు డొకడు అంకెల్ని ఇల్లా తిట్టాడు: శూన్యం, మొహంసిబ్బి; ఒకటంకి, చాపలేని కొయ్య; రెండంకి, ఉడతమడత; మూడంకి, మంచంపక్క; నాలుగంకి, గోడకుర్చీ; అయిదంకి, వదులుపిలక; ఆరంకి, హాకీకర్రముక్క; ఏడంకి, ఒంటిగోడసిమెంటు బాల్కనీ; ఎనిమిదంకి, అరగ్గా నిల్చిన పాత్రం; తొమ్మిదంకి, ముంతకొప్పుసాని. వీట్లమీద కోపం రేగినప్పుడు ఈవాక్యాలు ఓసారి స్మరిస్తూంటాను.

Iv ఓడినా మానలేనివాళ్ల సమర్థింపులు

కాని, నాకు అసహ్యం వేసిన కాస్సేపూ మాత్రం వీటిని అల్లా తిట్టిపోస్తానుగాని, వీటిని వదలగలనా? నా శరీరం నాకు తరుచు అసహ్యం వేస్తూంటుంది, శరీరాన్ని వదలగల్నా? అల్లానే ఇవీనూ! వాటిని జపించగా జపించగా ఎప్పటికేనా, అవే, నాశ్రమా నాకృషీ నాకాలమూ ఖర్చుకాకుండా నన్ను ఎందుకు గట్టెక్కించకూడదూ! మూటవచ్చి నాఒళ్లో ఎందుకు పడకూడదూ! ఇచ్చినప్పుడే అనుకోండి, నాకు ఇంత ఘనంగా ఎవ రివ్వగల్రు? అందుకని, అంకెలంటే అసహ్యమేకాని అంకద్యూతం అంటే తమాషా! బ్రాకెట్ నెగ్గితే, సొమ్ము అయిపోయిందాకా ఉషార్! బ్రాకెట్ ఓడితే, పోయిన సొమ్ము వచ్చేదాకా కసి!! లేనివాడికి బ్రాకెట్ ఆట అవసరం—ఎప్పుడైతేం, నిండెయ్యొచ్చు. ఉన్నవాడికి అవసరం — ఇంకా ఉంటుంది. ఒకడు జూదంలో ఓడిపోయి పరిగెట్టి పాడుగుల్లో దాక్కుని తన్ని పట్టుకోడాని కొచ్చిన తోటిజూదర్లు వెతికి పట్టుకోలేకపోయి, అతణ్ణి పట్టుకోడంమాట అల్లా ఉంచి, గుడిమెదటే జూదంఆట ప్రారంభించి 'నాది పందెం' అంటే 'నాది పందెం' అని కొట్టుకుంటూ ఉండగా, ఆ దాక్కున్న ఒకడు తన దాక్కున్న సంగతి మరిచిపోయి, "మీయిద్దరిదీ కాదు, పందెం నాది." అని కేకలేస్తూ పైకొచ్చేసి పట్టుబడ్డా డని శూద్రకుడు రాసింది స్వభావసిద్ధంకదా!

ద్యూతం సర్వజనవినాశకరం—అన్నాడు కవి! కాని, "ద్యూతం ఛలయతా మస్మి" అన్నాడు శ్రీకృష్ణుడు—అన్నాడు ఆకవే! ఔర! కవిత్వం మాటల్తో 'జూదం'; ఒకే కవివైన పై రెండు అభిప్రాయాలూ ఒక 'బ్రాకెట్'!!

---

మానవుల అవసరాలు బలం ఆరోగ్యం సౌఖ్యం

ఇంచుమించు అందరికీ ఇవి కొరవడివున్నా. అనుభవించడానికి అందరికీ హక్కు-అవకాశాలు వున్నవి.
జీవామృతము సేవించిన వారికి బలం, ఆరోగ్యం, సౌఖ్యం అలవడుతవి.



# జీవామృతము

ఆయుర్వేదాశ్రమము :: మదరాసు

---

టి. సి. యస్. గోల్డెన్ మెటల్

## సినిలోలకులు




జత 1 కి రు. 3/-

12 జతలవరకు వి. పి. చార్జి 10 అ.

టి. సి. నాగలింగప్ప అండ్ కంపెనీ,
280, వాల్ టాక్సు రోడ్డు, పార్కు టౌన్, మద్రాస్.

ఏజంట్లు:—

శ్రీ కె. యస్. తిమ్మప్ప శెట్టిగారు,
గోపువారి బిల్డింగ్సు, బెజవాడ.

---



రీటా తల వెంట్రుకలను పెంచును

రీటా కురుల్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు, ఇంకను తలవెంట్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగా పనిచేయును. వేనవేలువాడి గుణమును పొందియున్నారు. మీరు కూడా నేటినుండియే రీటా వాడుడు. రీటా ప్రతిచోట దొరకును. వెల సీసా 14 అణాలు.

---

# ప్రమద



స్త్రీల పాలిటి వర ప్రసాదిని. ప్రదరము, కుసుమరోగము (స్త్రీలు తెలుపెలువిడుచు వ్యాధులు) ఋతుశూల, దుర్బలత్వము, మేహాదులు, శగరోగము, బహిష్టు చక్కగా కాకపోవుట, వంధ్యాదోషము మొదలగువానిని హరించి సంతానవతులనుగా చేయుటలో శ్రేష్ఠమయినది. 8 ఔన్సుల సీసా రు. 1-12-0. 4 ఔ॥ సీసా రు. 1-0-0. పోస్టేజి ప్రత్యేకం. రు. 0-11-0. అగును. అన్ని ఔషధముల కేటలాగు ఉచితము.

పి. శి. ఏ. అండు కంపెనీ,
ఆయుర్వేదసమాజం,
పెరిదేపి, నెల్లూరుజిల్లా.

# "దేశాభిమానం అంటే-?"

= శ్రీ దిగవల్లి వేంకటశివరావు =

## ౧౮౫౭ సం. మ్యూటినీకి పూర్వపు తిరుగుబాట్లు

ఇంగ్లీషువిద్యావిధానం స్థాపించడంవల్లనూ, స్వాతంత్ర్య భావాలను వెదజల్లే ఆంగ్లసాహిత్య గ్రంథాలను చదవడంవల్లనూ మన దేశప్రజలలో దేశాభిమానం అనేది కలిగిం దనిన్నీ, స్వధర్మరక్షణకోసము, దేశోద్ధరణకోసము, దేశస్వాతంత్ర్యముకోసము పాటు పడడ మనేది ప్రారంభమైన దనిన్నీ ఆంగ్లేయ చరిత్ర కారులు వ్రాస్తూవుంటారు. ఇది నిజమేనని మనవాళ్లు కూడా కొందరు అంటూవుంటారు. అయితే ఇది కేవలమూ పొరపాటుమాట అని సుప్రసిద్ధ చరిత్రకారులైన ఎడ్వర్డు థాంప్సన్ గారు తమ హిందూదేశ చరిత్రలో వ్రాశారు.

దేశాభిమానము - జాతీయ చైతన్యము అంటే విదేశపరిపాలనను దేశీయులు అంగీకరించక తమ అసమ్మతిని చూపడమే అని అంగీకరించేటట్లయితే-అది యేలాంటి విద్యాభివృద్ధితోనూ నిమిత్తం లేని ఆత్మగౌరవానికి సంబంధించిన గుణ మని తేలుతుంది. హిందూదేశంలో ఇంగ్లీషువిద్యాగంధము లేశమైనా లేని కాలంలోకూడా ఈ విజాతీయపరిపాలనలో భారతీయులు తమకు జరుగుతూవున్న అక్రమాలను సహించక ఆ పరిపాలనపట్ల తమ అసమ్మతిని కనపరచిన నిదర్శనాలు అనేకాలు కనపడుతున్నాయి. ఈ దేశంలో ఇంగ్లీషుప్రభుత్వం స్థాపించడానికి మనవాళ్లు యిష్టపడి హర్షించలేదు. భారతీయులు తమ దేశ స్వాతంత్ర్యాన్ని - స్వధర్మాన్ని రక్షించుకోవడానికి మొదటినుంచి పోరాడుతూనే వున్నారు. మనవాళ్లు మళ్లీ తల యెత్తలేకుండా అణచివేయడానికి ఇంగ్లీషువారికి ఒక వందసంవత్సరాలు పట్టింది. ౧౭౫౭లో జరిగిన ప్లాసీయుద్ధము మొదలుకొని ౧౮౫౭-వ సంవత్సరంలో జరిగిన స్వాతంత్ర్యసమరం విఫల మయ్యేవరకూ స్వాతంత్ర్యము కోసమూ, స్వధర్మము కోసమూ భారతీయులు పోరాడని కాలమే లేదు.

ఇతర విజాతీయులను ప్రతిఘటించడానికి ఏకముగాని వివిధజాతులవారూ, మతములవారూ ఆంగ్లేయుల చేతులలోనుండి బయటపడడానికి ఏకమై తీవ్రంగా పోరాడారు అని ఎడ్వర్డు థాంప్సన్ గారు తమ భారతదేశ చరిత్రలో వ్రాశారు.

### ౧౮౫౭ సం. 'మ్యూటినీ' కి పూర్వం పాతికేళ్ల కిందట

భారతదేశ స్థితిగతులను గురించీ, ఇంగ్లీషు పరిపాలనలో గల లోపాలను గురించీ అనుభవజ్ఞులైన ఉద్యోగులూ, అనుద్యోగులూ కూడా నిర్భయంగా చర్చించవచ్చు నని ౧౮౨౮-౧౮౩౫ మధ్య హిందూదేశంలో గవర్నరుజనరలుగా వుండిన విలియం బెంటింకుగారు అవకాశం యిచ్చినందువల్ల అప్పట్లో ఇక్కడ ఉద్యోగం చేసే దొరలు కొందరు తమ అభిప్రాయాలను వెల్లడించారు.

ఉత్తర హిందూస్థానంలో పదిహేడేళ్లు న్యాయాధిపతిగా పనిచేసిన ఫ్రెడరిక్ జాన్ షోర్ గారు భారతదేశస్థితిగతులను గూర్చి ౧౮౩౨-౧౮౩౫ మధ్య కలకత్తా 'ఇండియా గెజెట్' అనే పత్రికలో వ్రాసిన అమూల్యవ్యాసాలు ౧౮౩౭ లో 'Notes on Indian affairs' అనే పేరుతో పదిహేను వందల పుటలు గల రెండు సంపుటాలుగా ప్రకటించబడినాయి. కంపెనీవారి పరిపాలనలో గల అన్యాయాలు, అక్రమాలు నిర్భయంగా వెల్లడించారు. ప్రజలు పడుతూవుండిన బాధలను కన్నులకు గట్టినట్లు వర్ణించారు. ౧౮౫౭-వ సంవత్సరానికిపూర్వం ఒక పాతికసంవత్సరాలనుంచీ హిందూదేశప్రజలలో ఆంగ్లేయకంపెనీప్రభుత్వంపట్ల తీవ్రమైన అసంతృప్తీ, అశాంతీ ప్రబలియుండినవనిన్నీ, వీలైతే ఈప్రభుత్వాన్ని ధిక్కరించాలని ప్రజలు ఆలోచిస్తూ కుట్రలు చేస్తూ

వున్నారనిన్నీ కొన్ని ఉదాహరణలు చూపుతూ లోపాలను వెంటనే సవరించకపోతే ఫ్రెంచిప్రజావిప్లవములో ఆదేశపరిపాలకులకు పట్టిన గతే ఇక్కడ వారికికూడా పడుతుందనిన్నీ స్పష్టంగా వ్రాశారు.

## కోల్ జాతుల పితూరీ

ప్రతితిరుగుబాటుకూ, కల్లోలానికీ ఏదో ఒక బలవత్తరమైన కారణం వుండితీరుతుంది. నిజమైన అసంతృప్తిలేకుండా వచ్చిన విప్లవాలు అరుదు. ఇటీవల జరిగిన కోల్ తిరుగుబాటులో చాలా మానవప్రాణాలు నష్టమైనాయి. ప్రభుత్వానికి చాలా సొమ్ము ఖర్చు అయింది. అప్రియమైన సంగతులను ఎంత కప్పిపుచ్చినా, ఎందరు కాదన్నా ఈతిరుగుబాటుకు నిజమైన కారణం కుంపినీప్రభుత్వాధికారులు చేసిన ప్రజాపీడనమూ, దోపిడిన్నీ అని బైటపడింది. ఈవుద్యోగులు లంచాలు పుచ్చుకొని తమ అధికారాన్ని దుర్వినియోగం చేసి కొందరికి మద్దతుచేశారు. ఈకోల్ జాతివాళ్లు వంగ రాష్ట్రానికీ, బీహారురాష్ట్రానికీ పశమరప్రక్కనుంచి అలహాబాదుకు కింద మిర్జాపురందగ్గర వింధ్యపర్వతాలదాకా వ్యాపించివున్న అరణ్యప్రదేశాలలో వుంటారు.

ఈకోలుతిరుగుబాటు మన గోదావరి మన్యంలో జరిగిన రంపపితూరీల వంటిదే. అల్లూరి సీతారామరాజుగారి పితూరీ ఎంత తీవ్రంగా జరిగిందో అందరికీ తెలుసును.

## ౧౮౫౭ సం. తిరుగుబాటు

౧౮౫౭ లో ఉత్తర హిందూస్థానంలోని ఉత్తర రాష్ట్రాలన్నింటిలోనూ కలిగిన కల్లోలానికికూడా ఇదే నిజమైన కారణం. అప్పట్లో కొద్దిగానో గొప్పగానో ప్రభుత్వంపట్ల విరోధభావం చూపని జిల్లా ఒక్కటైనా లేదని చెప్పవచ్చును. దీని కేవో కొన్ని కారణాలు చూపించడానికి కొందరు ప్రయత్నించారు. బర్మా యుద్ధంలో మనకు అపజయములు కలిగించినందువల్ల మన సైన్యాలను అక్కడికి పంపవలసి రావడమే ఒక కారణమన్నారు. తిరుగుబాటు చేసిన ముఠాలవారు దోపిడికోసం తిరిగే బందిపోటుగాండ్రేగాని అసంతృప్తి చెందిన ప్రజలు కారని చెప్పడం ప్రారంభించారు. ఇవన్నీకూడా కారణాలని ఒప్పుకోవడానికి అభ్యంతరం లేదు. కాని, మన పరిపాలనలో ఈదేశీయు లంత సౌఖ్యం అనుభవిస్తూ వున్నట్లయితే, మన అధికారాన్ని ధిక్కరించడానికి వీళ్లందరూ ఇంత ఉత్సాహంతో ఎందుకు ఏకమైనారు? ఉత్తర పరగణాలలో ఒక్క ముఖ్యభూస్వామిఅయినా మన ప్రభుత్వానికి సాయం చేయడానికి ఎందుకు పూనుకోలేదు?

దోపిడిసొమ్ములో కొంత పాలు పంచుకోవచ్చునని కొందరు బందిపోటుగాళ్లు తిరుగుబాటులో చేరిన మాట నిజమే అని ఒప్పుకొందాముగాని ప్రజల ప్రవర్తన ఎలా వుంది? ఈదోపిడి దొంగలకు మొదట గెలుపు కలగగానే దేశంలో ప్రజలలో ఉన్న ఇతర గతులవాళ్లుకూడా చాలామంది వాళ్లతో కలిశారు. అంతట ఈసమూహంయొక్క వుద్దేశ్యం కేవలమూ దోపిడిగాక ప్రభుత్వాధికారాన్ని ధిక్కరించడము గానే పరిణమించింది. దేశమంతటా అమితోత్సాహంతో "ఈ ఇంగ్లీషువారి రాజరికం అంతరించింది!..." అనే కేకలు ప్రతిధ్వనించాయి. కల్లోలం అణచడానికి తోడ్పడే పద్ధతి ఈప్రజలలో లేదనిన్నీ, ఆపనిని సర్కారుపోలీసువాళ్లకే వదిలి ప్రజలు తొలగివున్నారనిన్నీ చెప్పి సరిపెట్టుకున్నందువల్ల లాభం లేదు. స్వదేశ రాజుల పరిపాలనలో కల్లోలాలు కలిగినప్పుడు పలుకుబడి కలవాళ్లు తమ పరిజనులను, రైతులను పోగుచేసి ఆరాజులప్రభుత్వాలకు సహాయం చేసిన ఉదాహరణాలు ఎన్ని అయినా ఈ దేశచరిత్రలో కనబడుతున్నాయి.

పైన చెప్పిన ౧౮౫౭ సం. కల్లోలంలో మాత్రము ఇందుకు భిన్నముగా జరిగింది. ప్రజలు కేవలమూ దూరంగా తొలగి ఊరుకున్నారా అంటే అదీ లేదు. సర్వసాధారణంగా ఇంగ్లీషు మేజస్ట్రేటుల చుట్టూ తిరుగుతూవుండే జోహుకుములుకూడా ఈకల్లోలం ప్రారంభంకాగానే తమతమ ప్రదేశాలలో తమ పలుకుబడి వుపయోగించే నెపంతో చల్లగా జారి తమతమ స్వగ్రామాలకు వెళ్లి అక్కడ మనుష్యులను పోగుచేయడం ప్రారంభించారు. కాని ఎందుకోసం పోగుచేశారు?

తాము సిద్ధముగా వుండి తరుణం రాగానే ప్రభుత్వానికి వ్యతిరేకముగా వుపయోగించడానికే! ఇలాంటివాళ్లు కొంతమంది సాహసొత్తుగా ఎదురుతిరిగారుకూడా. శాంతిభద్రతలను కాపాడడానికి ఆసమయంలో వెంటనే చర్య తీసికోకపోయివున్నా, పిండారీదారులకూ, ప్రభుత్వబలాలకూ జరిగిన మొదటి సంఘర్షణలో అదృష్టవశంవల్ల మన ప్రభుత్వానికి సిద్ధించిన జయం కలగకపోయినా, లేదా కొద్దిరోజులు ఆలస్యం జరిగినా తీవ్రమైన పెద్ద తిరుగుబాటు బయలుదేరియుండి దానిని అణచడానికి మనకు ఉత్తరహిందూస్థానపు పరగణాలలో నున్న సైన్యాలన్నింటినీ వుపయోగించవలసివచ్చేదే. మన అధికారం విచ్ఛిన్నమైపోయేదే. ఆసమయంలో ప్రభుత్వంవారికీ, వివిధజిల్లా అధికారులకూ జరిగిన వుత్తరప్రత్యుత్తరాలు నేను చూశాను. సహారాన్‌పూర్‌నుంచి వచ్చిన జాబులో ఇలాగ వుంది. "దోపిడీగాళ్ల సంపాకటి ముందుగా లూటీకోసం బయలుదేరింది. వారికి కొంత జయం చేకూరగానే, ఆసంఘంలో ఇతరగ్రామస్థులు చేరారు. మరికొన్ని దోపిడ్లు జరిగినాయి. ఆజిల్లాలోని ప్రధాన భూస్వామి వీళ్లతో చేరాడు. వీరిని తన కోటలోకి ఆహ్వానించి బహిరంగంగానే ప్రభుత్వాన్ని ధిక్కరించాడు. ఈపిండారీదారులలో ఒకడు రాజబిరుదం వహించాడు. ఆసమయంలో ఆంగ్లేయప్రభుత్వసైన్యము వచ్చి తారసిల్లింది. ఇంకొక్కదినం ఆలస్యమైతే పిండారీలో మూడువేలమంది చేరేవాళ్లే. అప్పటికే పిండారీలో చేరడానికి యూభైమంది మొదలు మూడువందలమంది చొప్పున ముఠాలుగా ఏర్పడ్డారని బయటపడింది. మన సైన్యాలకు మొదటి తాకిడిలో అపజయం కలిగియున్నట్లయితే ఎంత బీభత్సం జరిగేదో చెప్పశక్యంకాదు." ఈ వుత్తరంలోని సంగతులను ప్రభుత్వంవారు కాదనలేదు. పైగా నిజమే అని ఒప్పుకున్నారు. ఈ కల్లోలంలో శ్రమపడినవారిని మెచ్చుకున్నారు.

ఓరిమిగల వంగదేశీయులకన్న శూరత్వము గల ఉత్తరపరగణాలవారిలో మాత్రమే ఈభావము లున్నాయనుకోవడం పొరబాటు. దిగువ దక్షిణపరగణాలలో కూడా తిరుగుబాటు సూచనలు పొడనూపేవున్నాయి. వారన్ హేస్టింగ్సుకూ, కాశీరాజుకూ తగవులు కలిగిన కాలంలో ఒక మాటు వారన్ హేస్టింగ్సు చచ్చిపోయాడని పుకారు పుట్టేటప్పటికి వంగరాష్ట్రంలో అనేక జిల్లాలలో, ముఖ్యంగా రాజషాయి బీర్‌భూమ్ జిల్లాలలో కల్లోలాలు బయలుదేరినాయి. రివిన్యూ వసూలు చాలారోజులుదాకా ఆగిపోయింది. ఆసమయంలో అక్కడ ఆంగ్లేయోద్యోగుల అధికారం కొన్నాళ్లు ఎందుకూ పనికిరాకపోయింది.

(Notes on Indian Affairs—Hon. Frederick John Shore, Vol. 1. pp. 158,167)

## ౧౮౩౮ లో తిరుగుబాటు ప్రయత్నం

౧౮౩౮-౯ సంవత్సరంలో ఇంగ్లీషువారు ఆఫ్ఘనిస్థానంమీదికి దండయాత్ర చెయ్యడానికి సైన్యాలు పంపినప్పుడు హిందూదేశమంతటా వున్న మహమ్మదీయప్రజలలో రహస్యమైన ఉద్రేకం కలిగినట్లు స్పష్టంగా కనబడింది. అయోధ్యారాష్ట్రంలోనుంచి అరబ్బీదూతలు బయలుదేరి దేశంలో నలుమూలలా తిరుగుబాటు చెయ్యడానికి ప్రచారం చేశారు. కాఫరులైన ఫరంగీలపైన 'జహాద్' అనే మతయుద్ధం చెయ్యవలసినదని ప్రోత్సహించే అర్థం వచ్చే మాటలను ఖురానులోనుంచి తీసి కరపత్రికలద్వారాను, తాయెత్తుల ద్వారాను ప్రచురించారు. ఇలాంటి అరబ్బీదూతలు కొంతమంది చెన్నపట్నందగ్గరకూడా పట్టుపడ్డారు.

ఆఫ్ఘనిస్థానములో ఇంగ్లీషుసైన్యాలకు జయం కలుగుతుందో, అపజయమే కలుగుతుందో అనే సందిగ్ధావస్థలో వున్న సమయంలో, అనగా ౧౮౩౮-౯ సంవత్సరంవేసంగిలో నిజాముగారి సోదరుడు కర్నూలు నవాబుగారికి వ్రాసిన రహస్యపువుత్తరం ఒక ముసలమ్మరహస్యలేఖలోనుంచి బయటపడింది. దానినిబట్టి విచారించగా ఆఫ్ఘనిస్థానంయుద్ధంలో ఇంగ్లీషువారు ఓడిపోతారని అనుకొని ఈదేశంలో వున్న మహమ్మదీయులందరూ ఏకమై తిరుగుబాటు చేయడానికి కుట్ర జరిగినట్లూ, దానికి కర్నూలు ఒక కేంద్రమైనట్లూ బయటపడింది. కర్నూలునవాబుకోటలో గోడలమధ్య నేలసొరంగాలలో ఫిరంగులు, ఫిరంగిగుళ్లు, ఫిరంగిబళ్లు, తోటాలు, తుపాకులు, మందుగుండుసామానులు, ఫిరం

గులు చేసే కొలుములు కనబడ్డాయి. కర్నూలు నవాబును ఖైదుచేశారు. ఆ సమయంలో భగవంతుడి సహాయం ఇంగ్లీషువారికి వుండబట్టిగాని లేకపోతే హిందూ దేశంలో వారి రాజ్యం భగ్నం అయ్యేదే. ఆఖరికి జాతివాళ్లు చాలామంది ఆహుతి అయ్యేవారే! అని 'సౌత్ ఇండియన్ స్కెచెస్' అనే పుస్తకంలో వ్రాశారు. ౧౯౫౩ సం. ఏప్రిలు నెల భారతిలో 'కందనూరు నవాబు రాజరికం' అనే శీర్షికతో నేను వ్రాసిన వ్యాసంలో దీని వివరా లున్నాయి.

## ౧౮౫౭ నాటి మ్యూటినీ అనే స్వాతంత్ర్య సమరం

కుంపినీ పరిపాలనలో ప్రజలు పడుతూవున్న బాధలు వెల్లడించి, కుంపినీవారికి మళ్లీ రాజ్యాధికారపు పట్టా యివ్వవద్దని దేశీయులు ఎంత మొర పెట్టినా లాభము లేకపోయింది. ౧౮౫౩లో మళ్లీ పార్లమెంటు వారు రాజ్యాధికారం కుంపినీవారి కిచ్చారు. దానితో కుంపినీఅధికారుల అక్రమపరిపాలనకు హద్దు పద్దు లేకుండా మితిమీరింది. దేశంలో అసంతృప్తి హెచ్చింది.

౧౮౫౬ నాటికి భారతదేశంలో రెండువంతులు బ్రిటిష్ యిండియాగా మారిపోయింది. మహారాజులు, సుబేదార్లు, నవాబులు చాలామంది నాశనం అయినారు. కొంతమంది భయపడి కుంపినీవారికి కప్పం కట్టి సంస్థానాధీశులుగా మిగిలారు. కుంపినీవారి రాజ్యాక్రమణ విధానంవల్ల ఏసమయంలో తమ రాజ్యం పోతుందో అనే భయంతో వున్నారు. పూర్వపు రాజులు, నవాబులు యిచ్చిన యీనాములను కుంపినీవారు లాక్కోగా యీనాముదారులలో అసంతృప్తి హెచ్చింది. రాకపోకలకు రోడ్లు, వ్యవసాయానికి నీటివసతులు లేక పన్నుల భారంకింద క్రుంగుతూ రైతులూ, చిల్లరవృత్తుల వాళ్లూ బాధపడుతున్నారు. కొత్తగా భూములు సంపాదించిన జమీందారులు రైతులను పీడిస్తూవున్నారు. కుంపినీవారి రివిన్యూవుద్యోగులు లంచగొండులై పన్నుల వసూళ్లలో హింసలు పెట్టి ప్రజలను బాధిస్తున్నారు. న్యాయవిచారణ లేక ఆలన పాలన లేక బీదలు అల్లాడిపోతున్నారు. పోలీసులు అప్రయోజకులుగా వున్నారు. బందిపోటులు హెచ్చినవి. పెద్ద జీతాలు పుచ్చుకునేవా రందరూ దేశభాష తెలియని ఇంగ్లీషువారు. వీరికి ప్రజల కష్ట సుఖాలు తెలియవు. మతబోధకుల కుతంత్రాలవల్ల ప్రజల మతం విధ్వంసం అవుతుం దనే భావం వర్ధిల్లింది. చలామణిలోపాలవల్ల ఆర్థికక్షోభ హెచ్చింది. దారిద్ర్యం ప్రబలింది. తమ చేతులలోనుంచి దేశపరిపాలన పోయిన దనే రోషం తురకలలో వ్యాపించివుంది. ప్రజల బాధలనుగురించి చెన్నపట్నంలో గాజుల లక్ష్మీనర్సు సెట్టిగారు, కలకత్తాలో రామగోపాలఘోషుగారు, బొంబాయిలో నౌరోజీఫర్దూంజీగారు మొదలైన దేశీయ నాయకులు శాంతియుతంగా ఆందోళన చేస్తూ ఎన్ని అర్జీలు పంపినా పార్లమెంటువారు కళ్లు తెరవలేదు. బాధలు దుర్భరమైనందువల్ల దేశప్రజలు తిరుగుబాటు చేశారు.

౧౮-౮-౧౮౫౭వ తేదీతో కలకత్తానుంచి 'ఒక బంగాళీహిందువు' అనే పేరుతో ఒకాయన వ్రాసిన 'భారతీయుల తిరుగుబాటుకు కారణాలు'(Causes of the Indian Revolt) అనే చిన్న పుస్తకాన్ని ఎడ్వర్డు స్టాన్‌ఫర్డు అనే అతడు లండనులో ప్రకటించాడు. కొంతకాలము చెన్నపట్నం సదరు అదాలతు కోర్టులో రెండవ న్యాయాధిపతిగా పనిచేసి నిష్పక్షపాతి అనిన్నీ, ధైర్యశాలి అనిన్నీ పేరుపొంది ప్రభుత్వమువారి ఒత్తిడివల్ల పనిమాలించుకున్న మాల్కొలం లెవిన్‌గారు ఆపుస్తకానికి సంపాదకుడుగా వుండి దానికి పీఠిక వ్రాశారు.

"భారతీయుల మతాచారాలతో ప్రభుత్వము వారు జోక్యము కలిగించుకోలే దనిన్నీ, ఇకముందు కూడా ఎలాంటి జోక్యమూ కలిగించుకో రనిన్నీ ౧౮౫౭ సం. విప్లవం ఆరంభం కాగానే గవర్నరుజనరలుగారు ఒక ప్రకటన చేశారు. ఆదివరకు జోక్యము కలిగించుకోలే దనే మాట పరాస్త బద్ధ మని యావద్భారతదేశమూ ఏకగ్రీవంగా ఘోషించేవున్నది. ఇదివరకు చేసిన వాగ్దానా లన్నింటినీ ఉల్లంఘించినవారు ఇకముందు తమ వాగ్దానం చెల్లించుకుంటా రనే నమ్మకం ఏమిటని ప్రతివారూ ప్రశ్నిస్తున్నారు." అని ఆచిన్నపుస్తకంయొక్క గ్రంథకర్త

వ్రాశాడు. గ్రంథపీఠికలో మాల్కలం లెవిస్ గారు ఇలాగ వ్రాశారు:

"భారతదేశాన్ని పరిపాలించే మన బ్రిటిషు వారికిన్నీ, పాలితులైన భారతీయులకున్నూ ఒకరి ఆచారాల సంగతి ఒకరికి తెలియదు. మనకూ, వారికీ వుండే సంబంధము యజమానులకూ, బానిసలకూ వుండే సంబంధమే. దేశప్రజలకు జీవితేచ్ఛను కలిగించే సౌకర్యాలన్నింటినీ వారికి లేకుండాచేశాము; మానవధర్మాన్నిబట్టి వారి కుండవలసిన అవకాశాలులేకుండా చేశాము. వారి వర్ణాశ్రమధర్మాలను దూషించాము. వారసత్వధర్మాన్ని రూపుమాపాము. వారి వివాహ సంస్కారాలను మార్పుచేశాము. వారి మతధర్మాలను బట్టి వారు పవిత్రంగా యెంచుకునే కర్మలను తృణీకరించాము. వారి దేవాదాయాలను లాగివేశాము. మన ప్రభుత్వం కచేరీలలో వారిని క్రైస్తవేతరులైన నాస్తికులుగా పరిగణించాము. దేశీయరాజుల రాజ్యాలు లాక్కున్నాము. జమీందారుల జమీలను తీసుకున్నాము. మన పన్నులపద్ధతివల్ల దేశముయొక్క ఆర్థికవ్యవస్థనే తారుమారుచేశాము. ప్రజలను చిత్రహింసలు పెట్టి బలవంతంగా పన్నులు వసూలుచేయించాము. ప్రపంచములో కల్లా పురాతనమైన గౌరవకుటుంబాలను, వంశాలను కూకటివేళ్లతో పెల్లగించి పంచముల స్థితికి దింపివేశాము. ఇలాంటి మార్పులు మన ఇంగ్లాండు దేశములోనే కలిగితే ఇంగ్లాండు ప్రభువుల కుటుంబాలన్నా, వంశాలన్నా గాఢమైన అభిమానము కలిగి క్రైస్తవమతవ్యాప్తి చేసే పట్టుదల కలిగియున్న షాఫ్ట్సుబరీప్రభువు మనస్సులో ఎలాగ వుండేదో! ఈ గ్రంథకర్త వ్రాసిన సంగతులలో చాలావాటితో నేను ఏకీభవిస్తున్నా, పగ తీర్చుకోవలసిన దని పలుమార్లు హెచ్చరించడమూ, వర్ణాశ్రమధర్మాలపైన కత్తిగట్టడమూ, ప్రజలను క్రైస్తవమతంలో కలపడానికి ప్రయత్నించవలసిన దని వ్రాయడమూ నాకు బాగాలేదు. హిందువుల సంగతి బాగా ఎరగనివాళ్లూ, అనేక శతాబ్దాలకు పూర్వము అనాగరక దేశంగా తప్ప ఇతరవిధంగా ఇంగ్లాండు పేరే ప్రపంచానికి తెలియని కాలంనాటి నుంచీ ఉన్న హిందూదేవాలయాలను చూడనివాళ్లూ మాత్రమే ఆ పురాతన దేశపు హిందూమత సిద్ధాంతాలు స్థిరమైనవి కావని భ్రమపడతారు. ఇంగ్లాండు చేసే ప్రయత్నాలవల్ల ఆ మతాన్ని విచ్ఛిన్నం చెయ్యవచ్చునని అనుకుంటారు. అవి చూసినవాళ్లు అలా అనుకోరు. ఒక వృక్షంయొక్క ఫలాలనుబట్టి దానిసంగతి తెలుసుకోవచ్చునని ఒప్పుకుంటే, ఒక్క నీతినియమాలనుబట్టి ఇంగ్లాండు హిందూదేశాలను పోల్చి చూస్తే వారి మతం మన మతానికి యేవిధంగానూ తీసికట్టు కాదని తెలుస్తుంది."



# 'కార్యమాపూడి'



= శ్రీ కవికొండల వేంకటరావు =

ఆశేషభారతవర్షానికి కురుక్షేత్ర మెలాంటిదో ఆంధ్రావనికి "కార్యమాపూడి శ్రీకదనరంగం" అలాంటిది. వేదవ్యాసుడు సులభమైన సంస్కృత భాషలో భారతగాథ నేలా ప్రవర్తింపజేశాడో శ్రీనాథుడు అలా లేటతెనుగుమంజరీద్విపదలో పల నాటి వీరచరిత్రను వర్తింపజేశాడు.

ఇంగ్లాండు దేశపు చరిత్రలో 'హేస్టింగ్సు' యుద్ధం ఏప్రకారంగా పటంగీసి ప్రకటిస్తారో ఆ ప్రకారంగా "కార్యంపూడి శ్రీకదనరంగాన్ని" తెలుగుదేశపు చరిత్రపుటల్లో ప్రకాశింపజేయవచ్చును. అంత నిబ్బరంగా 'సరికొండలు' సూచింపబడ్డాయి. అంత విపులంగా దాని దారి ప్రస్తావింపబడింది.

అక్కడ జరిగిన యుద్ధాన్ని బట్టి ఆ పేరు ఆ స్థలానికి వచ్చిందో, ఆస్థలామృతనామధేయాన్ని బట్టి అక్కడ యుద్ధం చేసి మన వీరులు మృతజీవులు అయి వున్నారో నాకు చెప్ప శక్యంకాకుండా వుంది. ఏమా అంటే—'కార్యము' అన్న పదానికి ఆకాలమందు యుద్ధము అని అర్థము. ఇక్కాలములోవలె 'కర్యాభావము' కాదు.

వర్తమానంలో హెచ్చుజీతాలు గైకొనే వుద్యోగస్థులూ, మేలురాబళ్లు గల ఈనాందారులూ కడుపు నిండిన చేరగాస్త్రీ చీట్లాటల్లోనూ, చెండాటల్లోనూ తమ కళాకౌశల్యాన్ని ఏలా విజృంభింపజేస్తూవున్నారో ఆరీతిగా ఇతఃపూర్వం మనవారు కావలసినంత రాజ్యం, భోగం సంపాదించుకుని జయశ్రీ చెట్టబట్టి యుద్ధమన్నదానిని కేవలం కళగా పెంపొందించుకున్నట్టు కనిపిస్తుంది.

అచ్చుపడంది అలా వుంచి అచ్చుపడినంతలో మనం లెక్కించిచూస్తే సుమారు ౬౦౦౦ పంక్తుల పదం అది. దానిలోకి ఇతరు లెవ్వరూ రారు. యవనులు, తురకలు, బుడతకీచులు, ఫ్రాంశీలు, డచ్చీలు, ఆంగ్లేయులు ఇలాంటివారు ఎవ్వరూ లేరు ఆయుద్ధంలో. నిఖార్సైన తెనుగుతీవరము, తెనుగుకావరము పైకొని వుంటాయి.

తెనుగువారు వారిలో వారు పోరాడుకున్నారూ అంటే అది అతివిచారకరమైన సంగతే. అయితే కురువంశీయులు తమలో తారు తగవులాడుకోలేదూ? వీరధర్మం నెరవేర్చవలసివచ్చినప్పుడు అంతఃకలహాలు లేపుకొని కొట్టుకోవడం అనేది తప్పుగా పరిగణించక, సాహసించి తొడచఱచడం అనాదినుంచీ ఆర్య సంప్రదాయము.

యుద్ధం చేయలేని నేటి ఆంధ్రనాయకులే అన్యోన్యం వాక్కలహాలతో నోళ్లు నించుకుంటూ వుంటే, యుద్ధం చేయగల నాటి పురుషవరేణ్యులు పౌరితం లేకుండా వుంటారు అని అనుకోవడానికి సుతరాం వీల్లేదు. కాని వొకటి పరామర్శింపకతప్పదు. మనం పాఠంగా నేర్చుకోకతీఱదు.

ఇరుపక్షాలకూ ఐకమత్యమే వుండివుండి ఆంధ్రేతరులమీదికి దాడివెళ్లివుంటే మన అదృష్టదేవత ఏలా వుండివుండేదో?– 'బాలచంద్రుడు' సంపూర్ణచంద్రుడై విరాజిల్లివుండేవాడేమో! 'చండసాహసి' చల్లని రాజై ఆసేతుహిమాచలం ఏలియుండేవాడేమో?— ఏతాదృశజిజ్ఞాస గతజలసేతుబంధనం. అనుకో తగం కూడాను మనం ఇప్పుడు. మన ఆంధ్రజాతిలో ఇప్పుడా కార్యమూ లేదు! సౌందర్యమూ లేదు!

కార్య ముంటే "ధక్కాధమామికడంగురంబుల"చప్పుళ్లు లేకుండా పోతాయా? సౌందర్య ముంటే 'నాసకేటు' తనలో నీడగానైనా చూపిం

కదా? లేదు! మన ఆంధ్రజాతిలో ఇప్పుడా శౌర్యమూ లేదు, సౌందర్యమూ లేదు. ఆ జోదుల నామరూపాదుల నుచ్చరించడానికూడా మన మీనాట తగం! ఆంధ్రరాష్ట్రమింకా రాని యీతరుణంలో అసలే తగం!

అలా గని చెప్పి కత్తి కిందపారేసి చతికిల బడ్డప్పటికిన్నీ కులమన్నది వాడిలో నిలిచివుంది, క్షాత్ర మన్నది మన భావంలో మాత్రప్రాయంగా మాఱు మోగుతూవుంది.

“వెలమల మైత్రిమి వీర జీవనత” అన్నాడు బాలచంద్రుడు తన తల్లితో! ‘వీర జీవనత’ అనే మాటను గమనించండి. ఆమాట — ఓ ఆంధ్ర సోదరులారా! మిమ్మల్ని పునః లేవనెత్తటం లేదూ? మిమ్మల్ని తిరిగి మేలుకొల్పడం లేదూ?

* * *

ఉంగరంలో రత్నము పొదివించినట్టు పొదివించాడు భూరేఖమీద, సుకవి, ‘కార్యమపూడి’ని. “కార్యమపూడి క్రీకలని రంగాని”కి తూరుపుదిక్కున ‘జువ్వలకల్లు’, ‘పన్నెగండ్లు’-దక్షిణమున ‘వప్పి చెర్ల’-పడమట ‘కొదమగుండ్లు’ ‘చింతపల్లి’-ఉత్తరాన్ని ‘జన్ని దేవరగుళ్లు’, ‘పరవాలమేడ’, ‘వంగతోటల వైలు’-ఈ పైచెప్పబడ్డ హద్దుల మధ్యను ఆ వీరక్షేత్రము ‘నాగులేఱు’ నదికి తీరమై తిరమైయున్నట్టు చెప్పబడివుంది. ఈ నాగులేఱు పలనాటి సీమకు నాకధుని.

‘పలనాడు’ అనే శబ్దానికి ఎన్నో అర్థాలు ఈవరలో చరిత్రకారులు నిర్వచించియున్నారు. వానిలో నొకటిరెండు నేనూ సూచిస్తాను, ఆలోచించదగినవైయుంటే ఆలకించండి. వెల్నాడు, పల్నాడు, పోల్నాడు, వేగినాడు, కోర్నాడు—ఇలా కొన్ని నాడులు ఆంధ్రరాష్ట్రభావంతోపాటు అమల్లో కొచ్చినాయి. ‘వెల్నాడు’ ‘వలనా’డైతే ‘పల్నాడు’ ‘డావలనా’డై ‘డా’పోయి‘పల్నాడు’ కావచ్చును. ‘వెల్నాడు’ ‘వెలినా’ డైవుంటే, ‘పల్నాడు’ ‘లోపలినా’డైవుండి ‘లో’ పోయి ‘పల్నాడు’ కావచ్చు. ‘పోల్నాడు’ ‘పోలుకర్రల నా’డైవుంటే, ‘పల్నాడు’ ‘ఫలముల నా’డైవుండి ‘పల్నాడు’ కావచ్చును. ఇవన్నీ వదలిపెట్టి ‘వేగినాడు’ అనేదానికి ‘వేడినాడు’ అని అర్థం చెప్పి మట్టమధ్యాహ్నంగా భావిస్తే ‘పలపల’ అనేదానికి ‘తెల్లవారు’ అనే అర్థం చెప్పుకొనవచ్చును. పలపలనాడు=మేలుకొన్న ప్రదేశమనో, వెలుగుగొన్న ప్రదేశమనో అనుకోవచ్చును. ఒక ‘పల’ పోయి ‘పలనాడు’ అని మిగిలియుండవచ్చును. అర్థం ఏదైనా వీరచరిత్రనుబట్టి చూస్తే ‘పలనాడు’ మంచి నాగరీక వైభవంతో తులదూగిన సామ్రాజ్యంగా తట్టుతుంది.

* * *

కథపట్టు నవలలాగు నడుస్తుంది. అన్న ముక్క మళ్లీ రాదు. వర్ణనలో పౌనరుక్త్యం లేదు. సూటిగా యుద్ధాని క్కారణం మొదటి పంక్తిలోనే సూచింపబడుతుంది—“మేడపిలో అలరాజు చావు.” ఈ చావును గురించిన వెనుకముందులు అక్కడక్కడ చదువుతూ తెలుసుకోవలసిందే! మఱి విశేషించి వ్రాయబడవు. కాని “అలరాజుచావు” ప్రతీకారం కోరే మాట సత్యం. ఎట్టి కృత్యం చేసి చూపిస్తే అది ప్రతీకారం అవుతుంది అని తలపోసి ఒక కట్టు వీర నాయకు లందఱూ మలిదేవునకు మేడపిలో పట్టం గట్టి ‘నలగాము’తో పోరాడ్డానిగ్గాను “కార్యమపూడి కదన రంగా”నికి ‘జయముహూర్తం’ పెట్టించుకొని పయనిస్తారు. “తొలేకాశికి దురం!” దురం ఎవనితో? గురిజాల నేలే కువలయేశునితో.” ఆకువలయేశు డెవరు? నలగామరాజు.

దండు పయనిస్తూవుంటే దారిపొడుగుతా వినిపిస్తాయి—డమాయీలు, మురజలు, బూరలు, భేరీలు, పోటుధారలు, కాహళలు, వంకిణులు, కాలికొమ్ములు, శంఖాలు, సన్నాయిజోళ్లు, మురళి చయం, ముఖవీణావితతి, సరగలు, తప్పెటలు, డోళ్లు, తమ్మటమ్ములు, వీరణములు, రుంజలు, కనక తప్పెటలు, చేగంటలు, చిఱుగంటలు. తళతళమంటాయి భైరవఖడ్గాలు. దివ్యస్వరూపాల్తో మూర్తీభవించివుంటారు మలిదేవభూపతి, మంత్రి బ్రహ్మన్న!!!

కథనాచాతుర్యం అపమానం. లౌకికతంత్రానికి పారలౌకికతంత్రం జోడింపబడివుంటుంది. మఱెన్నీ

అంతటి ఘోరం దేశాంధ్రగ్రంథంలోగాని, సంస్కృత గ్రంథంలోగాని వినియుండని విషాదాంతగాథకు కవి సత్కళాసౌందర్యం అతికిస్తాడు. ఈఫక్కి నేనెరిగున్నంతలో ఒక్క షేక్స్పియరుకే చెల్లు. మళ్లీ లెక్కిస్తే ఇందు మన శ్రీనాథునకే చెల్లు! "మడిసిన విసము ప్రసరింతు పీనుల పండువుగాను" అని కవి వచనం. అతని కబ్బమందు నబ్బాలచంద్రుని చావు పబ్బంలా కనపిస్తుంది. ఎందుచేత? యుద్ధరంగతత్వం కవి బాగా తెలుసుకున్నాడుకాబట్టి.

"ఇది సమరావని ఇది పుణ్యభూమి
శ్రీకంఠశిర సంటి చెప్పెద నీకు"

అని తుద కనిపిస్తాడు తండ్రిచేత! కొడుకును అంపిస్తాడు "తగినట్టి కర్పూరతాంబూల మిచ్చి, శంఖ తీర్థ మొసంగి జయమొందుమంచు."—తండ్రి బ్రహ్మన్న చేత—కొడుకు బాలచంద్రుని!

* * *

ఇప్పుడు నేను మీకు ముఖ్యంగా చెబుతూ వున్నది పలనాటి వీరచరిత్రలోని 'బాలచంద్ర యుద్ధము' అనే రసఖండిక.

ఏనాటి ప్రాచితోనో ప్రాబడియున్న సమర స్థలిని మనముందు శుచి గావిస్తాడు బ్రహ్మన్న. అర్ధరాత్రి శోకార్ణవం అయివుంటుంది. అప్పు డాజలమధ్యమందుండి యొక్క పుర్రె పొర్లాడుకొంటూ పడమరగా వచ్చి బ్రహ్మన్న వద్ద నిల్చి హసిస్తుంది, నిష్కారణంగా హసిస్తుంది. ఇదీ నేను అన్న పారలౌకికతంత్రం. తలపుర్రె బ్రహ్మన్నతో పలుకుతుంది. బ్రహ్మన్నను యుద్ధానికి హెచ్చరిస్తుంది. బ్రహ్మన్న—

"ఓ విశ్వమయమూర్తి! ఓ విశ్వకర్త!
ఓ లోకపావన! యో జగద్భరణ!
యో శాంభవీదేవి! యో జగన్మాత!
సమరంబునకు నీవు సాక్షివై యుండు"

అని ప్రార్థిస్తాడు. అయితే వెంటనే బ్రహ్మన్న మంత్రి యుద్ధానికనుజ్ఞ యీయడు. రాయబారం జరుపుతాడు. ఎదిరివారున్నూ సంధికోసమే ప్రయత్నిస్తారు-ఛప్పన్న దేశాల రాజుల్ని తోడ్పాటుగావించుకొని వుండిన్నీ, కారెంపూడిని దరిసినవారైన్నీ - ఎదిరివారున్నూ సంధికోసమే ప్రయత్నిస్తారు.

ఈసందర్భంలో నలగాముని వైభవవర్ణన మరు రూపం. అందు ముఖ్యంగా నాట్యమేళాన్ని గురించి, భద్రగజాన్ని గురించి చదివితీరాలి. మరి మేడపిలో బాలచంద్రుని బంగారుబొంగరాల ఆటో? అదీ చదివి తీరవలసిందే!

—ఆపంక్తు లన్నీ నేనిక్కడ ఏకరువు పెట్టానా అంటే పదం సంగ్రహించి ప్రకటించిన మహనీయుల కన్యాయం చేసినవాణ్ణి అవుతాను. మీరే ఆపుస్తకం నేరుగా సంపాదించుకుని సాంతంగా తిరిగ్గావల్లించండి!

"బాలచంద్రుడు వీరయువకుడుగదా! తనతండ్రీ, తన ప్రభువూ పోరికి వెళ్లినప్పుడు ఇతడు బొంగరాలెందు కాడుతూవుండడం వచ్చింది?" అని ప్రశ్నిస్తే ప్రశ్నించవచ్చు మీరు. వీరయువకుడైనా బాలచంద్రుడు ఓభోగందాన్ని వుంచాడు. దాని యిల్లు మరిగి అసమయమప్పుడు దానియింట నిదురపోతూ వుండివుంటాడు. కాని యీతరువాతను బొంగరాల ఆటప్పుడు అన్నమ్మ అనే వైశ్యకాంతయొక్క మీగాలికి బాలచంద్రుని బొంగరం అవశాత్తూ తగులుతుంది. దాంతో ఆ "చక్కటి కోమటిజలజాయతాక్షి" బాలుని తిడుతుంది. తిడుతూ బాలచంద్రుణ్ణి ఎగసందోస్తుంది.

"మీయయ్య లెల్లను మించినబలిమి
కేరి వైరులతోడ శ్రీయుద్ధభూమి
నప్పాంగుచున్నవా రుర్విపై నెదుట
వారిలో గలియుము నీవడి కానవచ్చు"

అని ఎసగొల్పుతుంది. కార్యంపూడి వెళ్లారని చెప్పరు. బాలచంద్రు డడిగినా మబ్బరు. దాంతో బాలచంద్రుడికి నిజం తెలుసుకోవలెనన్నే కుతూహలం ప్రబలమౌతుంది. తల్లియైన ఐతాంబను అడుగుతాడు. ఐతాంబ ఈబిడ్డణ్ణి కానక కానక ఎన్నో నోములు నోచి కన్నది కావడంచేత ఒకపట్టాను సత్యం చెప్పదు. కాని బాలుడు వినుకోడు. "చిన్నమిర్యమునకు చెడునె కారంబు" అని మదలకిస్తాడు. మరి అతణ్ణి యుద్ధవిముఖుణ్ణి చేయడం తనవల్ల కాదని తలపోసి ఆతల్లి తన తనయుణ్ణి గండువారింటి కనుపుతుంది. గండువారంటే బాలచంద్రుని అత్తవారు. గండుకన్నమనీని కుమార్తెయైన మాంచాలను బాలచంద్రున కిచ్చి పెల్లి

చేశారు, కొత్త పెద్ద బ్రహ్మాండంగా. కాని యొక్కలేయీ భార్యాభర్తల నడవడిక ఆ నవయౌవనదంపతుల మధ్య లేకపోవడమే కాదుకదా పరస్పరం చూచుకొనికూడా యెఱుగరు. అయితే ఆరోజుల్లో వీరుడు యుద్ధానికి వెళ్లబోయేముందు భార్యచేత దీవెనపొంది మఱీ బయలుదేరాలి.

బాలచంద్రుడు మాంచాలఅందానికి ఆగేడా? ఆగితే ఒకందుకు మంచిదే అయివుండేది. బ్రహ్మన్న వంశం తరతరాలుగా నిల్చిపోయేది. కాని ఆలా జరుగలేదు. వారిద్దఱి మధ్యను "ముత్యాల చేరులు మెండటికి తెగెను." పాపం! ఎంత ముస్తాబు గావించుకొని పడకగదిలోనికి వచ్చింది మాంచాల! ఆమె సహజంగా సౌందర్యవతి! దానికి తోడు

"సంపెంగతైలంబు చయ్యన దెచ్చి
మగువకు శిరసంటి మంచి గంధమున
నటకలి రాచిరి యానూనె పోవ
బంగారుబిందెల పన్నీరు దెచ్చి
స్నానమాడించిరి సంతసం బొప్ప."

మఱిమఱి ఎన్నో చేశారు, ఎన్నో కైసేశారు. అయితేనేమి, పెనిమిటి ఆమె పమిటిచెంగు కొడిసిపట్టే సరికి ఆచీరపైనున్న "ముత్యాల చేరులు మెండటికి తెగెను." మాంచాల కది అపశకునంగా తోచింది. కాని బాలచంద్రుడు కొదమసింహంలా మెఱసిపోతూ ఆలిని ఆశీర్వదించ మని కోరాడు.

"వచ్చుచు దీవించె నలినాయతాక్షి." దీవించి, ఆయుధం చేతి కిచ్చి ఆహవకేళికి పంపించింది.

పంపిస్తూ సలహా చెబుతుంది. ఆమెప్రాజ్ఞత యెంత గొప్పదో! అనపోతు అనే బ్రాహ్మణవీరుని వెంటపెట్టుకుపోవద్దంటుంది. అందువల్ల మగనికి బ్రహ్మహత్యాదోషం పట్టుకుంటుంది, యుద్ధభూమిలోకనక అనపోతు సంహరింపబడితే నని ఆమెభయం. ఈ మాత్రంముక్క మహాభారతగాథ వ్రాసేటప్పుడు ద్రోణుణ్ణిగురించిగాని, అశ్వత్థామనుగురించిగాని, కృపాచార్యుణ్ణిగురించిగాని ఆముదుసలి వ్యాసుడికూడా తట్టివుండలేదు.

అయితే కథకూ దీనికీ సంబంధ మేమిటయ్యా అంటారేమో! మాంచాలయొక్క ఏతద్విజ్ఞాపనం విశేషప్రయోజనమైనదిగా తుదకు పరిణమిస్తుంది.

అనపోతుపుట్టువే విచిత్రప్పుట్టువు. ఓవిధంగా బాలచంద్రునకు అన్నగారు. ఏలాగూ అంటే బాలచంద్రుని తల్లి ఐతాంబ సంతానానికిగాను నిమ్మచెట్టు నొక్క యేడాది పూజిస్తే ఆనిమ్మచెట్టు ఒక్క ఫలం ఇచ్చింది అనుకోండి. దాన్ని ఎనిమిదిముక్కలుగా చేసి తొలిముక్క విప్రకాంతకు పెట్టింది. తక్కిన ఆరున్నొక్క ముక్క తానున్నూ, తన ఆరుగురు సపత్నులున్నూ తీసికొని తిన్నారు. విప్రకాంత తొలిముక్క తింటూ గర్భం దాల్చి అనపోతును కన్నాది. మలిముక్క తిని ఐతాంబ బాలచంద్రుని ప్రసవించింది. ఈలా మఱి ఆరుగురు మిగతా ఆరుగురికి కలిగారు.

అనపోతు అన్నంతపనీ చేయగల సమర్థుడు. పరశురాముడివంటి పావనమూర్తి. తప్పకుండా యుద్ధభూమికంటా బాలచంద్రుణ్ణి వెంబడించి విజృంభింప దలచుకొన్న మేటిమగడు. అయితేనేం, మాంచాల బోధించినదానిపైని బాలచంద్రు డెదో పన్నాగం పన్ని ఓపనిమీద అనపోతును వెనక్కు పంపివేశాడు. పంపివేసి అక్కడ్నే రావిచెట్టుకు పోచీటీ కట్టాడు తిరిగి రావడంలో ఆరావిచెట్టు దాటిరాకూడ దని. అనపోతు తిరిగివచ్చి, మాయ గ్రహించి తాను యుద్ధానికి వెళ్లక పోయినట్టయితే ఈ తను వెందుకన్నట్టు ఆరావిచెట్టు క్రింద తన్ను పొడుచుకు చనిపోయినాడు. చనిపోయే ముందు మాడచి అనే ఓ దాసెపాయ్యే చిన్నదాన్ని పిలచి దాని ద్వారా తన నెత్తురుజండెం, తన బిరుదు బాలచంద్రున కంపుతాడు.

ఈజండెం, ఈబిరుదు, ఈసాహసపుటాత్మహత్య ఎప్పుడు తెలిశాయి బాలచంద్రుడికి?—వీరులందరూ ఇరుపీళ్లవారు సంధిమాటలు గావించుకొని విందు లారగింపబోయే సమయానికి తెలిశాయి. బాలచంద్రునకు మఱి శాంతివమ్మయింది. వెంటనే యుద్ధం చేయవలె నన్నాడు. నరసింగు తల నఱికి తెచ్చి బ్రహ్మన్నముందు పెట్టితీరుతాను అని ప్రతిన పూనాడు. దాంతో—

"వీరులు దొరలును వేగమె లేచి
సంధికార్యము మాని జాహ్నవి కేగి
యామద్గులో వేసి రన్న మంతయును"

చూచారా? ఎంతలో మారిపోయిందో కర్తవ్యం!

మలి బాలచంద్రుని శౌర్యం చెప్ప శక్యం కాకుండా, పట్టపగ్గా లేకుండా మారిముసగింది. వర సింగశిరము తెగ్గొట్టి తండ్రికి పాల పెట్టాడు. తాను సంకులసమరంలో అభిమన్యునిలా స్వర్గం చూర గొన్నాడు. బాలచంద్రుడు యుద్ధం చేసినచోట పిశాచ గణాలు పీకమొయ్యా నెత్తురు త్రాగాయి.

ఈలా రణరంగంలో వొక వంక బాలచంద్రుని చావు పరిణమిస్తూవుంటే మరోవంక నాయకు రాలు బంధింపబడుతుంది.

నాయకురాలు అనగా నాగమ్మ. బాలవితంతు వుట. ఆమెఅసలుపూరు వో మారుమూలపల్లెటూరట. ఆమెవచ్చి నలగామరాజుకు మంత్రిత్వం చేసింది అంటే ఎంతటిది కాదు! ఆమె పేరట చిరంతనంగా 'నాయకు రాలి కనుమ' నేటికిన్నీ నిర్వహింపబడుతూవుంది. పల్నాటివీరచరిత్రలో ఆమె విదుషీమణి! వీరనారీ మణి! విచిత్రవిఖ్యాతఖని!

యుద్ధభూమిలో మరోవంక మలిదేవుడు మర ణించివుంటాడు.

తుదకు నలగాముడు, బ్రహ్మన్న మాత్రమే మిగిలిపోయి "పోరు నష్టం పొందు లాభం" అనే నయ మార్గం అవలంబిస్తారు. ఏకరాజ్యంగా, రామరాజ్యంగా గురిజాలను రాజధానిగా చేసుకుని ఏలుతారు.

నలగాముని వంశావళి కొద్దిగా వివరిస్తాను. నాగ పూరుకు, జబ్బలపూరుకు మధ్యను వున్న చేదిదేశం ఏలిన హరిహరుని కుటుంబంలోవాడట అసలు అనుగు రాజు. ఆ అనుగురాజు కొడుకులు ఈ నలగాముడు, మలిదేవుడు. కాని తల్లులు వేఱు. అందుచే సవతి సోదరులు.

తలచితే తఱుగని మహాగాథ ఈ వీరచరిత్ర. వలసలూ వనవాసాలూ ఎన్నో వస్తాయి. మహిమలూ మంత్రాంగాలూ చాలా వున్నాయి. ఆంధ్రులకు సంబం ధించిన ఆనలూ ఆనవాయితీలూ అసంఖ్యాకాలు!— వదిసెగారు వస్తే మఱుదులు లేవాలి!

* * *

స్వస్త్యస్తు విజయోస్తు.
"శ్రీశైలభూమిలో శ్రేష్ఠమైనట్టి
కార్యమపూడి శ్రీకదనరంగమ్ము."





# డోంగ్రేగారి

## బాలామృతము

బలహీనమైన బిడ్డలకు
పుష్టియున్ను, బలమున్ను
ఆరోగ్యము నిచ్చును.

---

## అగ్ని, మోటారుకారు
## భీమాకు
↓



## యునైటెడ్ ఇండియా

ఫైర్ అండ్ జనరల్
ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్,

యునైటెడ్ ఇండియా లైఫ్ బిల్డింగు,
ఎస్ప్లనేడ్, మద్రాసు.
టెలిఫోన్ : 4241.
Grams : "UNIGEN"
పోస్టుబాక్సు : 1207.

---

## సహజ సౌందర్యము



'కామినియా నూనె' ప్రతిరోజూ వాడుట వల్ల వేల కొలది స్త్రీలు తమ కేశ సౌందర్యాన్ని పెంపొందించుకుంటున్నారు. దీనిని వాడినవెంట్రుకలు బాగా పెరిగి మెదడుకు చలవచేయును.

## కామినియా నూనె
(రిజిష్టర్డు)

సీసా 1-కి రూ 1/- 3 సీసాలకు రూ 2/10-
వి. పి. ఛార్జీలు వేరే. ఉచితమైన మోస్తరు
సీసాకు మూడుకాన్ల బిళ్లలు పంపండి.

---

## ఓటో దిల్ బహార్
(రిజిష్టర్డు)

ప్రాగ్దేశ విశిష్టతగల చక్కని సువాసన ద్రవ్యము. చాల సమ్మోహనము. ఎంతకాలమైనా వాసనపోకుండ నుండును.

¼ ఔన్సు రూ 1/4- ఒక డ్రాము అ॥ 12/-
వి. పి. ఛార్జీలు వేరే.

సువాసనగల కార్డు 1 అణా. ఉచితమైన మోస్తరునకు 2 అణాల బిళ్లలు పంపండి.

సోల్ యేజెంట్లు:

ANGLO-INDIAN DRUG &
CHEMICAL CO., BOMBAY. 2.

# దుమ్ములగొండె

[కథానిక]

= శ్రీ చాగంటి సోమయాజులు =

చెడ్డతొందరగా అడుగులు పడ్డాయి. సైనికుల్లాగ చకచక నడుస్తున్నాము. కంకర ఎక్కపెట్టిన రోడ్డుమీద 'మణ్యం' ఆకుజోళ్లు టపకటపకా ఎగురుతున్నాయి. గిరిరావు బూట్లు ఇనపనాళ్ల నాదంతో మెట్లంగిరాళ్లని మోగిస్తున్నాయి. నాకు జోళ్లు లేవు. నా అరికాళ్లు చెప్పుజోళ్లకన్నా బలమైనవి. వేళ్లకి దెబ్బలు తగలకండా నిపుణతతో అడుగులు వెయ్యడం నాకాళ్లకి తెలుసు. ఎక్కపెట్టిన రాళ్లని నాకాళ్లు కళ్లున్నట్టు తప్పించుకోగలవు. ఎంత కర్కశంగా మార్గమున్నా కాళ్లకి ఇబ్బంది లేదు. మిట్టమధ్యాహ్నపు తారురోడ్డు దోసెల రేకులాగ వేడెక్కినా నెక్కుతూ ఆవిరులొస్తున్నా నాఅరికాళ్లు భరిస్తాయి. నానడకతొందరకి భూమి అదురుతున్నాది.

ముగ్గురం ఒక్కలాగ అడుగులు వేస్తూ ఒక్కబిగిని ఒకరికి ఒకరం తీసిపోకండా నడుస్తున్నాం. బూట్ల నాదం మద్దెల మోతలాగుంది. ఆకుజోళ్లు తాళం వేస్తున్నట్టున్నాయి. నాకాళ్లు సన్నని శ్రుతిలాగ పడుతున్నాయి. మూడూ ఒక్క శ్రుతిలో మిళితం అవుతున్నాయి.

మాట్లాడకండా వూపిరి బిగపెడుతూ నడుస్తున్నాము. అర్ధరాత్రి. కోటలో గంట ఠంగుమని కొండలమధ్య కొచ్చి మారుమోగింది. వెన్నెల కర్పూరంలాగ వెలుగుతున్నాది. సాయంకాలం పెద్ద వర్షం కురవడాన్ని ఆకాశం నిర్మలంగా ఉన్నాది. మచ్చకొండ, సూదికొండ, దుమ్ములకొండా అభ్యంగనం చేసుకొని నీటుగా లేడీల్లాగ మఠాలు వేసుకూచున్నాయి.

కుమిలిఘాటీకి మాఅర్ధరాత్రిపికారు. ఘాటీమీద నూతికి దిగే మెట్లమీద కూర్చుంటే కోనాడసముద్రతీరందాకా కనబడే విశాల దృశ్యాన్ని వెన్నెట్లో చూస్తూ ముగ్గురం కుచ్చిటప్పాలతో జాగరం చేస్తాం. భయంకరమైన ఏకాంతసీమలో సుందరజాగరం.

నల్లని నీడలో గోతిడునీళ్లు వెన్నెలపడి తెల్లగా చెంగల్వపువ్వులాగ వికసించాయి. రోడ్డువార కాలువలో నక్షత్రాలు మాకన్నా వడిగా పరిగెడుతున్నాయి. గుండ్రపటి గోతినీట్లో నక్షత్రాలు గోతినిండా గడ్డిపువ్వుల్లాగ ఉన్నాయి. గెడ్డలో నీళ్లు పారడం లేదు. కాని వర్షానికి నాని గెడ్డలో ఇసక జిమజిమలాడుతున్నాది. చెమ్మమీద చంద్రకాంతి పడి గెడ్డ జిగ్గని తెల్లజరీచీరలాగ మెరిసిపోయింది.

చుట్టూ కొండలు వలయంగా చుట్టేశాయి. ఆమధ్య నున్న భూస్థలం గంగాళంలాగున్నాది. కప్ప లరుస్తున్నాయి. ఎన్ని కప్పలరుస్తున్నాయి! అర్బుదాలు నిర్బుదాలు అరుస్తున్నాయి. దగ్గరలో ఉన్న కప్ప టాంకు టాంకు మంటున్నాది. మానడకతొందర కదివెనకపడిపోయింది. మాముందు ఇంకొక కప్ప అరుస్తున్నాది. అన్నికప్పలకన్నా దాని అరుపులో ఏదో ప్రత్యేకత గోచరమౌతున్నాది. కాని అది మేళంతో కలిసి ఎంతోసేపు పాడలేదు. అకస్మాత్తుగా ఊరుకొంది. కప్పల ఆర్కెస్ట్రా మొత్తంమీద ఉద్భవంచేస్తున్న 'హార్మోనీ' వింటూ నడుస్తున్నాను. గంగాళంలాంటి భూవలయంలో కళపెళ ఎసరు ఉడుకుతున్నట్టు కప్పలు మోతపెడుతున్నాయి. దిగంతాల్లోంచి ఏదో తొణికిపోతున్నట్టు కప్పల మోత తిరగబడుతున్నాది.

తుళ్లిపడి వెనక్కి చూశాను. వొళ్లంతా పులకరించింది. నాచెవులకి స్పష్టంగా గాజుల నిక్వాణం వినపడ్డాది. నర్తకి గుల్లకడియాల్లో రాళ్లగుణగుణ వినబడ్డాది. మావెనకాతల ఏఅప్సరసలూ రావడం లేదు. ఆ భ్రమని కలిగించింది కీటకగానం. కీటకాలు కోటాను కోట్లు తంత్రీస్వనాలు మీటుతున్నాయి. కప్పల మోత గంభీరంగా వినబడుతున్నాది. కీటకగానం వీణానిక్వాణాల్లాగ సహస్రతంత్రుల మీంచి వినబడుతున్నాది. మానడకకి కప్పల మోత మిలిటరీబేండు. కీటకాలమోత నా హృదయంలో మధురరసాన్ని ఊరిస్తూ అప్సరసల్ని కళ్లెదటికి తీసుకొస్తున్నాది. నా కెదురుగా దెయ్యాల్లాగ ఆత్తులు విరగబోసుకొని ఈతలు నడుచుకొస్తున్నాయి. కాని నాఎదట రంగస్థలం విద్యుద్దీపాలతో ఉజ్వలిస్తున్నాది. దాంట్లో నటీనటులు మధురరస ప్రధానమైన భరతనాటిక నటిస్తున్నారు. మువ్వలు మోతపెడుతున్నాయి. వెండి మువ్వలు, గాజులు గలగల్లాడుతున్నాయి. గోటులూ, దిల్‌రుబాలూ, సారంగులూ, చితారులూ సహస్రతంత్రులతో మోగుతున్నాయి. గట్టిగా పాడ్డానికి ప్రారంభించాను.

"గోపీపీనపయోధర............"

"షటప్" (Shut up) అన్నాడు గిరిరావు.

"నేను పాడుకుంటే నీకేం ?" అన్నాను.

"ఘాటీ ఎక్కేదాకా నోరు కదపడానికి వీలులేదనుకొన్నాము" అన్నాడు మణ్యాం. నిజమే.

"మీతో సరిగ్గా అడుగువెయ్యలేక పోతేకదా ?" అన్నాను.

"నో" అన్నాడు గిరిరావు.

కొండలలోంచి ధీరసమీరం శీతలంగా వీచడం ప్రారంభించింది. చెట్లలోంచి ముత్యాలు రాలుతున్నాయి. వనమాలిని ఉద్దేశించి హాయిగా పాడుకోనిచ్చారు కాదు.

నాగొంతుకలో పాట ఆగిపోయింది. నా నుదురుమీంచి, ముక్కుమీంచి పెదిమ మీదికి జారి ఘర్మసలిలం ఉప్పగా పడ్డాది. తడిసిపోయిన చొక్కాలోంచి సమీరం వెళ్లి నా త్వగింద్రియానికి చల్లగా చక్కిలిగింత పెడుతున్నాది. నాకళ్లెదట రంగస్థలం, నాట్యమండలి మాయమైపోయాయి.

మాకు దగ్గరలోనే నిలబడి నక్క చూస్తున్నాది. నక్క నిలబడి నిర్భయంగా

చూస్తుంది. ప్రమాదం దగ్గిరకొచ్చిందంటే నే తోకముడిచి పరుగెడుతుంది. లేకపోతే మన ల్ని నిబ్బరంగా నిలబడి మోరెత్తి చూస్తూ 'నువ్వేమి చేస్తావు?' అని ప్రశ్నిస్తుంది. నక్కని చూస్తే నాకు కుమిలిఘాటీకథ వొకటి జ్ఞాపక మొచ్చింది. ఆకథ గిరిరావుకీ తెలుసు.

"మణ్యాం, అదిగో దుమ్ములగొండె" అన్నాను.

"సీతలకాయ" అన్నాడు మణ్యాం.

"అదిగో చూడు" అని చూపించాను.

"నక్క" అన్నాడు గిరిరావు.

"ఇంకోటికూడా వెనకాతల ఉన్నాది" అన్నాడు మణ్యాం. నక్కదంపతులు వాహ్యాళి కొచ్చారు.

"దాసు వీటిని చూచేకాబోలు పారు కొన్నాడు" అన్నాను.

"అంతే అయిఉంటుంది" అన్నాడు గిరి రావు.

"ఏదాసు?" అనడిగాడు మణ్యాం.

"దుక్కణ్ణి ఎరగవూ? కాళిదాసు." అన్నాను.

"వాడు! ఎందుకు పారుకొన్నాడు?" అనడిగాడు మణ్యాం.

"ఇక్కడే. సైకిలుమీద కొండవాడ్డు దాకా షైరు వెళ్లేట్ట. సాయంకాలం. దుమ్ముల గొండె కనబడ్డాదిట. అక్కణ్ణుంచి సైకిలు వెనక్కి తిప్పి ఇంటికి వొచ్చి చతికిల్లా పడ్డా డు. వాడికి ప్రాణాలు లేవు" అన్నాను.

"పిరికివా డన్నమాట" అన్నాడు మణ్యాం.

"పట్టపగలు దెయ్యమంటే జడుసుకొం టాడు" అన్నాడు గిరిరావు.

"రామరామ" అన్నాడు మణ్యాం.

"అదేమన్నమాటలే. ఇక్కడ చిరత పులులు లేకపోయినా పెద్దనక్క, దుమ్ముల గొండె ఉన్నమాట వాస్తవం" అన్నాను.

"లేవురా" అన్నాడు గిరిరావు.

"మంచివాడివి. దానన్న పేటగొల్లవాళ్ల నడుగు. దుమ్ములగొండె పెయ్యని ఎత్తుకు పోయిందో లేదో. ఎప్పుడూ ఈకొండని ఉండ దుకాని వెలగాడకొండమీంచి అప్పటప్పట వొస్తూఉంటుంది." అన్నాను.

"నలుగు రుంటే ఏం చేస్తుందిలే" అన్నాడు గిరిరావు.

మణ్యాం నవ్వేడు. గట్టిగా, హేళనగా నవ్వేడు. మణ్యాంది విజయనగరం కాదు. మాకొండలని ఏజంతువూ లేదనే వాడి నిబ్బరం. కాని దుమ్ములగొండె ఉందనే—నే నెప్పుడూ చూడకపోయినా — అంతా అంటారు.

నాకు బితుకు పట్టుకొంది. బండరాళ్లన్నీ దుమ్ములగొండెల్లాగ కనబడ్డం మొదలెట్టే యి. మానడకజోరు తగ్గలేదు. రాళ్లన్నీ జంతువుల్లాగ కదులుతున్నాయి. ఒక రాయిని చూచి జంతువనే నిర్ధారణ చేసుకొన్నాను. దాని నడ్డీ, మూతీ గాడిదఆకారంలోనే కనబడ్డాయి. తేరిబారిచూస్తే మహావికృత మైన దుమ్ములగొండిస్వరూపం కనబడ్డాది. ఒక్కఅడుగు ఆగి చూస్తే రెండు రాళ్లు కన బడ్డాయి. కాని రాళ్లన్నీ దుమ్ములగొండెల్లాగ కనబడుతున్నాయి.

నాపిరికితనానికి నాకే నవ్వొచ్చింది. ఇదివర కెన్నిసార్లు ఘాటీకి వెన్నెలరాత్రిళ్లలో

వెళ్ళలేదు? చిన్నప్పట్నుంచీ అవకతవకస్థలాలకి స్నేహితులతో షైర్లు పోయిన నక్తంచరుణ్ణే!

అదేదో వృక్షం-పేరు మరిచిపోయాను-కనబడ్డాది. బగ్గిలుబగ్గిలుగా మెరుస్తూ తెల్లని బెరడుతో ఆమానుకొమ్మలు వెన్నెట్లోకి భయంకరంగా లేచిఉన్నాయి. ఆవృక్షము కిందే నలమహారాజుకి శనిదేవత ఆవహించిందిట. ఆకారణంచేత ఆచెట్టుకిందికి మనం వెళ్లకూడదని నిషేధం ఉన్నాది. పిచ్చి నిషేధం!

మామిడితోట్లో కెళ్లాము. చీకటిగా ఉన్నాది. రోడ్డునిండా మామిడిచెట్లు ఆవరించిఉన్నాయి. అంచేత రోడ్డంతా తివాసీలు పరిచినట్టు నీడలున్నాయి. నీడల అందాన్ని చూచి నేను ముగ్ధుడనౌతాను. మావీథిమెట్ల మీద కూచుని వాకట్లో పెద్ద పువ్వులాగ పడ్డ కొబ్బరిచెట్టు నీడనీ, గోడమీద రంగవల్లికలుగా ఏర్పాటుఅయిన తుప్పల నీడలనీ చూసి ఆనందిస్తూ రాత్రి రెండు మూడు గంటలదాకా సిగరెట్లు కాలుస్తూ కూర్చున్న రోజు లున్నాయి. కాని మామిడితోటలో రోడ్డుమీది నీడలన్నీ మచ్చల మెకాల్లాగున్నాయి. గుండె కొట్టుకొంది.

కింకిణీస్వనం లంకిణీదేవి గుర్రులాగుంది. కప్పల ఆర్కెస్ట్రా కొండదేవతబలికి నరులని తీసుకుపోతున్న కిరాతుల డోలు వాయిద్యమైపోయింది.

నామీద దెయ్యంలాగ భయం ఆవహిస్తున్నాది. మేకపోతు గాంభీర్యంతో ముందుకి అడుగులు వేస్తున్నాను. కాని గుండె జారిపోతున్నాది. శరీరంలో రక్తం, మాంసం, ఎముకలూ మాయమైపోతున్నాయి. శరీరం గుల్లతేరిపోయి ఆఖాళీనిండా భయం నిండిపోతున్నాది.

మణ్యంకి పిసరు భయం కలగలేదు. చెక్కుచెదరకండా అడుగులు వేస్తున్నాడు. నా అడుగులు తడబడుతున్నాయి. శని వృక్షముకిందికి వొచ్చాము. తెల్లని పొలుసులు పేలిన బెరడుతో దాని కొమ్మలు ఆకాశంలోకి తలలెత్తి కనబడ్డాయి.

ఘాటీనందు చీకటిగా కబంధుడి అంగుడులా గుంది. ఘాటీమీదికి తోవతీసుకుపోతున్నాది. సూదికొండ కబంధుడి అంగుట్లో కొండనాలికలా గుంది. లోపలకి వెళ్లుతున్నకొద్దీ కబంధుడు బారలు జాచి నోట్లోకి మమ్మల్ని లాక్కుపోతున్నట్టున్నాది.

"ఒరే, గిరిరావ్, ఇప్పుడు ఈ గోతుల్లో నీళ్లు తాగడానికి దుమ్ములగొండె నిజంగా వొస్తే మన మేమి చెయ్యగలం?" అని ప్రశ్నించాను. గిరిరావు స్థలజ్ఞుడు. ఆ ప్రశ్నతో అతనికీ నాభయం అంటువ్యాధిలాగ తగులుకొన్నాది.

"ఏమిటి చేస్తాం?" అని తిరిగి ప్రశ్నించాడు గిరిరావు.

"మనదగ్గర కర్రయినా లేదుకదా, మీదికొస్తే ఏమి చేయగలం?" అని తిరిగి ప్రశ్నించాను.

"కలియబడదాం" అన్నాడు మణ్యం. అతనికి నవ్వుతాలుగా ఉన్నాది. నాకు నవనాళ్లూ తోడుకుపోతున్నాయి.

"హాస్యంకాదురోయ్. ఈ స్థలాలు మంచివి కావు. ఏమి చెయ్యగలం?" అని ప్రశ్నించాను.

"గట్టిగా కేకేస్తే హడలెత్తి పారి

పోతుంది. దాన్ని చూచి మన మెంత భయ పడతామో అదీ మనల్ని చూచి అంతా భయపడుతుంది." అన్నాడు మణ్యాం. వాడి కింకా నవ్వుతాలుగా ఉన్నాది. గిరిరావు ఆలోచనలో పడ్డాడు. రాళ్ల రోడ్డు ఘాటీ మీదికి లేస్తున్నాది. శరీరాన్ని ఎత్తుకి మోసుకొని వెళ్లడానికి కాళ్లు లొటలొట లాడుతున్నాయి. గిరిరావు అడుగువెయ్యడం మానేశాడు. నేనూ నిలబడిపోయాను.

"ఘాటీకి వెళ్లడం ప్రమాదమే" అన్నాను.

"ప్రమాదమే" అన్నాడు గిరిరావు.

నన్ను భయం పూర్తిగా వశంచేసుకొంది. శరీరాన్నంతా ఆవహించింది. భయం శరీరాన్నంతా ఆవహించడం అందరి అనుభవంలోనూ ఉండదు. సాధారణంగా భయం గుండెల్లో ఒక భాగాన్ని మాత్రమే పట్టుకొంటుంది. ఇంకోభాగం ధైర్యాన్ని ఉపాసనచేసి భయపిశాచిని గెంటేస్తుంది. పిచికని పట్టుకుని పావుగంట చేతులో ఉంచి చూడండి. అది చచ్చి ఊరుకుంటుంది. దాని గుండెలు భయంచేత ఆగిపోతాయి. భయం అంటే అదీ. అదీ నన్ను ఆవహించింది.

"వెనక్కిపోదాం" అన్నాను. భయం అంటువ్యాధి. ఈవ్యాధి క్రిమిసంపర్కం లేకండానే పక్కవాడికికూడా వ్యాపిస్తుంది.

"పోదాం" అన్నాడు గిరిరావు.

కాళ్లు ముందుకు పడలేదు. కాళ్లకి శిలలు కట్టినట్టు నిలబడ్డ చోట నిలబడిపోయాము. శరీరం ఏనుగంత బరువెక్కిపోయింది. శరీరం నిండా నిండి వేలకొద్దీ టన్నుల బరువుతో భయం ఆవహించిఉన్నాది.

"నాకాలు మరి ముందుకు పడ్డం లేదు" అన్నాను.

"నాదీనీ" అన్నాడు గిరిరావు.

"నిజంగా?" అన్నాడు మణ్యాం.

"నిజంరా బాబూ - పదా" అన్నాను. మణ్యాన్నికూడా భయం పట్టుకొంది. వాడికి భయం మామ్మూలుగా పట్టుకోలేదు.

"అమ్మో" అని పెద్ద కేక వేసి వెనక్కి తిరిగేడు. తారకమంటుకొంది.

"ఎందుకేనా మంచిది, రాళ్లు పట్టుకోండి" అన్నాడు గిరిరావు. రెండు చేతులా అందరం రాళ్లు వేరి పట్టుకొన్నాం.

భయం గెంటేడం మొదలెట్టింది. కాళ్లు ఎంత తొందరగా పడుతున్నాయో తెలియదు. ఘాటీమీంచి దిగడాని కేముంది? అంతా దిగుడు. ఐదు నిమిషాలైనా అయిందో లేదో సీతాఫలంతోటా, దానిమధ్యనుండి పోయే కొండవాగులో ఇసకా చేరుకొన్నాం. తోటలో రెల్లివాళ్ల పాకా, దూరంగా కళ్లాలలో కనబడ్డాయి. మనుషుల అలికిడి, పశువుల సవ్వడి అయింది. "ఛీఛీ" అన్నాను. నామీద నాకు అసహ్యం వేసింది. అంత పిరికితనం పట్టుకుందేం? లజ్జ వేసింది.

బట్టలు పూర్తిగా తడిసిపోయాయి. కాని ధీరసమీరం ఇంకా వీస్తున్నాది. నా చంక తిమ్మిరెక్కింది. అప్పుడు నాకు జ్ఞాపకానికొచ్చింది. చంకలో అణిచిపెట్టి టీఫ్లాస్కు ఉన్నాది.

"టీ తాగుదాం" అన్నాను.

"చల్లబడనీ" అన్నాడు గిరిరావు.

నల్లచెరువుమెట్లల్లో బండరాయి ఎక్కి చలికిల్లా పడ్డాం. టీ తాగి రాత్రి అక్కడే పడుకొన్నాం. తెల్లవారుఝామున నక్కల అరుపులతో లేచాము. అరుణోదయ మౌతున్నాది. కాని కుమిలికొండలు అరుణోదయాన్ని అడ్డేస్తున్నాయి.

ఇంకా ధీరసమీరం వీస్తున్నాది. కాని యమునాతీరం, వనమాలీ, చంచల కరద్వయం ఆనాడు మరి కనబడలేదు. కుమిలిఘాటీ మీది ఏకాంతంలో సోపానాలు, వెన్నెట్లో మనోజ్ఞంగా కోసాడ సముద్రతీరందాకా కనబడే విశాలదృశ్యం, సర్పంలాగ మెలికలు తిరిగి మెరిసిపోతూ కనబడే చంపావతీనదీ చూసి అనుభవానికి తెచ్చుకొనే అవకాశం ఆ రాత్రి లేకపోయింది.

కాని ఆనాటి దుమ్ముగొండె అనుభవం జీవితంలో ఘనమైన భ్రాంతిమదలంకారము.

---

# కాలగమన రంగంపై

## అంచెలతో ప్రారంభమైన తపాలు తంత్రం

ఉత్తరాలను ఒక చోటినుండి యింకొకచోటికి చేర వేసే పద్ధతికి తపాలాపద్ధతి అని ఇటీవల వచ్చిన పేరు. వెనుక దీని పేమ టేవారో తెలియదుగాని ఈ ఉత్తరాల రవాణా అనాదిగా జరుగుతూనే వున్నది. మనప్రాచీనులు అస్సీరియనులతోను, బేబిలోనియనుల తోను, పర్షియనులతోనూ ఉత్తరప్రత్యుత్తరాలు జరు పుతూ వుండేవారని విదేశయాత్రికుల వ్రాతలవల్ల మనకు తెలుస్తూనే వున్నది. ఒకానొక పాండురాజా రోమను రాజయిన అగస్టసుతో తరుచు ఉత్తరప్రత్యుత్తరాలు జరిపేవాడని అంటారు. చంద్రగుప్తుని కాలంలో, వర్తక సామగ్రి రవాణాకును, ఉత్తరప్రత్యుత్తరాల రవాణాకును అనుకూలంగా, పాట్నాదగ్గర గంగానదీ తీరంనుంచి లాహోరుమీదుగా పంజాబులోని తక్ష శిలవరకూ ఒక రాచబాట ఉండేదట.

మొగలు చక్రవర్తుల కాలంలో, రాజకీయ వ్యవ హారాలను బట్టి, ఉత్తరాల రాకపోకలు ప్రబలం కావ లసివచ్చింది. అందువల్ల తపాలా పద్ధతిలో కొంత అభి వృద్ధి యేర్పడింది. గుఱ్ఱాలమీద తపాలుకాగితాలు పంపేపద్ధతిని షేర్‌షా ప్రవేశపెట్టినాడు. ఆపద్ధతి ప్రకా రంగా బెంగాలునుంచి సింధురాష్ట్రందాకా ఉన్న రెండువేలమైళ్ల రోడ్డుపొడుగూతా రెండేసిమైళ్ల కొక చోట జంటగుఱ్ఱాలు తయారుగా ఉంచేవారు. అక్బరు చక్రవర్తి మరికొంత ముందడుగు వేసినాడు. ముఖ్య మైన రోడ్లలో అంతటావదేసి మైళ్ల కొకచోట ఒకొ క్కటి చొప్పున తపాలుఖానాలనే ఏర్పాటుచేసి, వాటిల్లో టర్కీగుఱ్ఱాలను సిద్ధంగా వుంచేవారు. ఈ విధంగా రోజు కొక వందమైళ్ల ప్రయాణం సాధ్యము య్యేది. తరువాత మొగలు సామ్రాజ్యపతనంతో ఈ తపాలుతంత్రంకూడా వెనుకపడిపోయింది.

అటు పిమ్మట సక్రమమైన ఒక తపాలు విధాన మంటూ దేశంలో ఏర్పడింది క్లైవుకాలంలోనే. అతని హయాంలో ఆయారోడ్ల పక్కల్లో వుండే జమీందా రులే తపాలా రన్నర్లను సమకూర్చి పూచీ పెట్టుకొనే వారు. అతని తరువాత వచ్చిన వారన్ హేస్టింగ్సు ఈ తపాలావిధానంలో మరికొంత అభివృద్ధి తెచ్చిపెట్టి నాడు. అదివరకూ రాజకీయ లేఖలకే తావుండేది, అదిమొదలుకొని ప్రయివేటు లేఖలకుగూడా తావు దొరికింది.

తరువాత ౫౦ ఏండ్లు తపాలాచరిత్ర ఇంచుమించుగా తెరమరుగునపే ఉండిపోయింది. ౧౮౩౭ కు పూర్వం వరకూ సర్వసామాన్యమైన ఒక తపాలాపద్ధతి అంటూ లేనేలేదు. కలెక్టర్లూ, జిల్లాఆఫీసర్లే వారివారి అధికార స్థానాల్లోని తపాలాఫీసులకూ, తపాలారవాణాలకూ బాధ్యులుగా వుండేవారు. యావన్మంది తపాలా ఉద్యో గులమీదా అధికారం వహించడానికీ, సదరుపద్ధతిలో ఒక క్రమమైన నియమాన్ని ఏర్పాటుచేయడానికీ కేంద్రా ధికారియే ఉండేవాడు కాదు. తపాలాబిళ్లలు ఉండేవి కావు. తపాలారుసుము నగదుగానే చెల్లించేవారు. ౧౮౩౭ లో దశమారింది. ఈతపాలాశాఖ తాలూకు సర్వాధికా రాలనూ గవర్నమెంటువారికి సంక్రమింపజేస్తూ ఒక చట్టం ఏర్పడింది. తపాలాశాఖ అందరి ఉపయోగానికీ వచ్చింది. గవర్నమెంటువారు మినహాగా మరెవరూ తపాలుకాగితాలను తీసుకొని వెళ్లగూడదని నిషేధం జారీ అయింది. పావుతులం ఉత్తరానికి అర్ధణా అంటూ ఒక నికరమయిన రుసుము అమలులోకి వచ్చింది. కాని దూరాన్ని బట్టి అది పెరుగుతూవుండేది.

౧౮౫౪ వచ్చింది. తపాలాచరిత్రలో పెద్దమార్పు పొడగట్టింది. ఈ శాఖశాఖంతా ఒక డైరెక్టరు జనరలు చేతిలో పెట్టబడింది. తపాలాబిళ్లలు ప్రవేశపెట్టబడి నాయి. దూరముతో నిమిత్తము లేకుండా ఉత్తరాల బరువును మాత్రం నిమిత్తంచేసుకొని క్రమమైన రుసు ములు ఏర్పాటయినాయి.

అలాగే ముందుకు ముందుకు నడుస్తూవచ్చింది ఈ తపాలాతంత్రం. ౧౮౮౦ లో ఇంకొక నవ్యత్వం వచ్చింది. అదివరకూ ఒకచోటి నుండి ఇంకొక చోటికి డబ్బుపంపవలెనంటే గవర్నమెంటు ఖజానాల ద్వారా మాత్రమే పంపవీలయ్యేది. అందులో అనేక చిక్కులుం డేవి. ౧౮౮౦ లో మనియార్డరు పద్ధతి వచ్చింది. ఆ చిక్కులు తప్పినాయి.

ఆతర్వాత ౧౮౮౨ లో సేవింగ్సు బ్యాంకి ఏర్పాటయింది. మామూలు రాబళ్లుగల చిన్న ఉద్యో గులు వీలయినంతలో కొంత డబ్బు నిలువ చేసుకోవ డానికని ఈపద్ధతి ప్రారంభమైంది.

ఈమధ్యకాలంలోనే ౧౮౭౧ లో పార్సెలు, లేక భంగీపద్ధతికూడా ఈ తపాలుశాఖవారు చేపట్టినారు. అంతవరకూ భంగీలను తీసుకొనిపోవడమంటే పాటు పద్ధతిలోనే తీసుకొనిపోయేవారు. కావళ్లలో తగిలిం చుకొని మోసుకొనిపోయేవారు. భంగీ అంటే కావడి బద్ద. ఈ పేరుకూడా అందువల్ల వచ్చిందే. కావడిబద్ద మీద రవానా అయ్యే పార్సెళ్లకు అందువల్లనే బంగీలు అని పేరు వచ్చింది. ఈ పార్సెలుతపాలుకు దూరా న్నిబట్టీ, బరువునుబట్టీ రుసుము వసూలుచేసేవారు. క్రమంగా ఈతపాలును రైళ్లలో తీసుకుపొయ్యే ఏర్పా టయింది. ౧౮౭౧ లో ఈఏర్పాటుకాగానే పార్సె లు రుసుముకూడా ఉత్తరాలకు మాదిరిగానే మారింది.

వి. పి. పద్ధతి ౧౮౭౭ లోనూ, ఇన్‌ష్యూరెన్సు పద్ధతి ౧౮౭౮ లోనూ ఏర్పాటయింది.

ఇలాగా, క్రమక్రమంగా అభివృద్ధి చెందుతూ ఇప్పు డీ తపాలుశాఖ "ఇంతింతై వటు డింతయై....." అన్నట్టుగా విశ్వరూపం దాల్చి, భూమినాలుగు చెర గులూ వ్యాపించి ప్రజాసేవ గావిస్తున్నది. వివిధపద్ధతు లలోనూ ముందడుగు వేస్తూ వికాసంపొందుతున్నది.

'మాడర్న్ రివ్యూ'

---

## కవుల కథలు

ఒకనాడు రిచర్డ్ బ్రిన్‌స్లీషెరిడన్ (౧౭౫౧-౧౮౧౬) తనయింట్లో కూర్చొని, రూపాయలసంచీ తీసి ముందు పెట్టుకొని, డబ్బు లెక్క పెట్టుకొంటున్నా డట. ఆసమయానికి సరిగా ఒక దర్జీవాడు వచ్చి తనకు రావలసిన బాకీమొత్తానికి ఒక చిట్టీ ఆయనయెదుట పెట్టినాడట. దానిని చూచి, షెరిడన్ "అయ్యా, మహాశయా, ఇందులోనుంచి దమ్మిడీ నీకివ్వడానికి వీలు లేదు. లెక్కా, పత్రమూ లేని ఒక నోటిఅప్పు తీర్చ డానికి నే నిది ముడుపుకట్టినట్టు కట్టిపెట్టుకొన్నాను" అన్నాడట. ఆయన అలా అన్నాడో లేదో, మరు క్షణం దర్జీవాడు తన చీటీ ముక్కలుముక్కలుచేసి "ఇప్పుడు నాదికూడా నోటిఅప్పే కదండీ" అన్నాడట. షెరిడన్ వాని తెలివితేటలకు మెచ్చుకొని, వాని అప్పు దమ్మిడీలతోసహా ఇచ్చివేసి, పంపెనట.

ప్రాణిజాలాన్ని చూస్తే రాబర్టుబ్రౌనింగుకు (౧౮౧౨-౧౮౮౯) చాలాయిష్టం. చిన్నతనంలో అత నెవరయినా 'నీకేంబహుమానం కావా'లని కోరితే, అతడు ఏదో ఒకప్రాణిని బహుమానంగా కోరేవాడు. జబ్బుతో పండుకొన్నప్పుడు అతని కేదయినా ఒక మచ్చులకప్పనో, ఇంకేదన్నానో ఇస్తే సరి మెుండి కెత్తకుండా మందుతాగేవాడు. ఇలా చేరిచేరి కొన్నా ళ్లకు అతనివద్ద ఒక పెద్ద బలగం ఏర్పడిపోయింది. అతని మందిరం ఒక జంతుశాల అయిపోయింది. గూబలు, కోతులు, ముళ్లపందులు, లేళ్లు, పాములు ఒకటేమిటి నానారకాలూ అతని పోష్యవర్గంలో చేరిపోయినాయి. అతడు వాటిని చాలాప్రేమతో కాపాడుకొంటూ, బహుఉల్లాసంగా వాటితో ఆడు కొంటూవుండేవాడు. అవసానసమయంవరకూకూడా అతనికి ప్రాణిహింసపేరు వినపడితేసరి కళ్లల్లో జలజల నీళ్లు రాలేవి.

ఒకవిద్యార్థి ఒకసారి "నేను జార్జిబెర్నార్డుషా (జననం ౧౮౫౬) సంతకం సంపాదిస్తాను చూసుకోం" డని సహాధ్యాయులతో పందెం వేసుకొన్నాడట. తదర్థం అత డేవేవో ప్రయత్నాలు చేసిచూసినాడు. ఊహూం, ఫలించలేదు. ఆఖరుకు, చిట్టచివరియత్నంగా, ఒకజాబు షాపేరట ఇలా వ్రాసినాడు: "మా విద్యార్థినిలయంలో మా పోషణకింద ఒక ముద్దులపంది ఉన్నది. దానికి ముచ్చటగా బెర్నార్డుషా అనేపేరు పెట్టవలెనని అనుకొన్నాము. దయచేసి తమ అనుమతి కోరుతున్నాము." ససేమిరా వల్లకాదంటూ షానుంచి జవాబు వచ్చింది. అయితేనేమి, ఆవిద్యార్థి అనుకొన్న పని సాధించినాడు. షా సంతకం లభించింది. పందెం గెలిచాడు.

యస్. వి. రంగణ్ణ (ప్రబుద్ధకర్ణాటక)

---

## సేఫ్టీ రేజర్ నిర్మాత చిత్రచరిత్ర

ఈకాలంలో మన దేశంలోకూడా ఎంతమందికో స్వంతక్షౌరం నిత్యకృత్యం అయింది.

నూనూగు మీసాలూ గడ్డాలూ వస్తూవస్తూవుండే నూత్న యువ్వనులు మొదలు గడ్డాలూ, మీసాలూ నెరసిపోయిన శతవృద్ధులవరకూ అన్ని వయస్సులవారూ స్వంతక్షౌరం చేసుకుంటూనే ఉన్నారు.

ఈస్వంతక్షౌరం ఇంత ఇదిగా వ్యాప్తిలోకి ఎట్లా వచ్చిందంటే సేఫ్టీ రేజర్ వల్లనే.

సేఫ్టీ రేజరులో ప్రతివాడికీ ఎంతో సౌలభ్యమూ, ఎంతో హాయీ, ఎంతో అనుకూల్యమూ అవుపించింది.

అట్టి సందర్భంలో ఆసేఫ్టీరేజరును నిర్మించిన దెవరో, ఏపరిస్థితులు దాని నిర్మాణానికి దారితీశాయో తెలుసుకోవటం అవసరమూ, అహ్లాదకరమూ కాదూ?

సేఫ్టీ రేజరును నిర్మించిన అతడు కింగ్ కాంప్ గిల్లెట్టీ. అతడు ౧౮౫౫-వ సంవత్సరంలో అమెరికా లోని విస్కాన్సన్ అరణ్యప్రాంతాలలోని ఒకపట్టణంలో జన్మించాడు.

తండ్రి ఏదో సామాన్యవర్తకుడు. ఆయన వర్తకంమీద వచ్చే ఆదాయంతో సంసారం గడవటమే కిందట్టు మీదట్టుగా వుండేది.

అంచేత పట్టుమని పదేళ్లయినా రాకముందే గిల్లెట్టీకూడా సంసారభారం వహించాల్సి వచ్చింది.

గిల్లెట్టీ చిన్నప్పట్నుంచీకూడా చాలా చురుకైన వాడు. అస్తమానమూ ఏదో ఆలోచిస్తూ ఏమిటేమిటో కొత్తకొత్త సంగతులనుగురించి ప్రశ్నలతో తండ్రిని వేధించుకుతింటూవుండేవాడు. అతని దృష్టి ఎప్పుడూ మరయంత్రాలమీదా, ప్లానులమీదా ఉండేది. కనపడ్డ ప్రతివస్తువునీ స్తనశల్యపరీక్ష చేసి దాని ఆనుపానులు అవగాహన చేసుకుంటేనే కాని, అతనికి శాంతి వుండేది కాదు.

ఇట్లా ఉంటూండగా అతని ౧౬-వ ఏట తండ్రి తాలూకు ఆస్తి అంతా అగ్నికి ఆహుతి అయిపోయింది. తండ్రి బాగా ముసలివాడైపోయాడు. సంసారభారం యావత్తూ అతనిమీదే పడ్డది. సరే, తండ్రివర్తకాన్నే బరువుబాధ్యతలు గమనిస్తూ నిర్వహించటం మొదలు పెట్టాడు. ౨౧-వ ఏడు వచ్చేసరికి వర్తకంలో బాగా గడితేరాడు.

అయితే, సహజంగా వున్న ఆలోచనలూ, అభిరుచులూ సన్నగిల్లలా అతనిలో. ఏవేవో కొత్తకొత్త ఉద్దేశాలు! ఏమేమిటో చేయాలని ఊహలు! ఆ స్థితిగతులలోనే ఒకపుస్తకం రాశాడు.

అందులో గృహనిర్మాణంలో ఒక కొత్త పద్ధతిని వివరించాడు. ప్లానులతో, పటాలతో సమగ్రంగా రాశాడు, ఆపుస్తకాన్ని. దానిప్రకారం నిర్మితమయ్యే గృహం గోపురాకారంలో ఉంటుంది. అందులో కొన్ని వందల మంది నివసించేందుకు వీలుంటుంది.

కాలం గడుస్తూవుండింది. గిల్లెట్టీకి మూడు పదులు పైబడి ఆరేళ్లు గడిచాయి. ఈలోగా, తండ్రినుంచి అందుకున్న ఆవ్యాపారం కాస్తా, అతని అన్యమనస్కతవల్ల, నష్టకారకమైపోయింది. జీవితం గడపటానికి జరవు దొరకలేదు. అన్యుల్ని ఆశ్రయించక తప్పలేదు.

ఈ సందర్భంలో అతనికి విలియం పెయింటర్ ఆశ్రయం లభించింది. పెయింటర్ 'క్రౌన్ సీల్' కని పెట్టిన ప్రఖ్యాతి వంతుడు. గిల్లెట్టీ అవి అమ్మటానికి అతనివద్ద కుదురుకున్నాడు. ఏదోవిధంగా భుక్తి గడవటం-కాలక్షేపం జరిగిపోతోంది.

ఒకరోజున పెయింటర్ పనిపెట్టుకుని గిల్లెట్టీని గ్గరకు పిలిచి ఏవో ఆమాటలూ ఈమాటలూ లోకాభిరామాయణం కానిచ్చి మాటలో మాటగా- "మనిషికి యావజ్జీవితమూ ఉపయోగపడే వస్తువును దేనినైనా ఎందుకు కనిపెట్టకూడదనూ?" అన్నాడు. "ఒక్కసారి కొని ఊరుకోనటానికి వీలైనదానిని కనిపెట్టి లాభం లేదు. ఎప్పుడూ కొనవలసిన అవసరం ఉండేదానిని కనిపెట్టాలి" అనికూడా అన్నాడు.

అసలు స్వతహాగానే అటువంటి అభిరుచీ ఆలోచనా కల గిల్లెట్టీమీద ఈమాటలు బాగా పని చేశాయి. అటువంటిదానిని దేనినో ఒకదానిని కనిపెట్టితీరాలని నిశ్చయించుకున్నాడు. అహోరాత్రాలూ అదే ఆలోచన.

ఒక నెల గడిచింది. ఒకరోజున క్షౌరం చేసుకుంటున్నాడు. మంగలాడికి ఆరో, బేడో ఇవ్వటం ఎందుకని ఒక చాకుకత్తి తీసుకుని తానే 'గొట్టటం' ఆరంభించాడు. గడ్డం బాగా మాసివుంది. అదీకాక, బిరుసు. ఆకత్తితో గీసుకుంటే తగని బాధపెట్టి దేవుడు కనపడినంత పనవుతూంది. ఆక్షణంలో అతని మనస్సులో ఒక ఆలోచన మెరుపు మెరిసినట్లు మెరిసింది.

గడ్డం చేసుకోవటానికి అంతకన్నా మంచి సాధనం-సులభమైన, సుకరమైన సాధనం ఎందుకు కనిపెట్టరాదూ అన్న భావం తట్టింది. "నిజమే, ఎందుకు కనిపెట్టరాదూ?" ఇదే ఆలోచన.

చేస్తూ చేస్తూన్న గడ్డంసంగతి అటుంచి, వెంటనే అది ఎట్లా వుంటే బాగుంటుందో మనస్సులో చిత్రించుకోవటం ఆరంభించాడు. అరగంటలో దాని ప్లాను కాగితంమీద తయారయింది.

సరే, గడ్డం పూర్తిచేసుకుని, వెంటనే ఇనప కొట్టుకు వెళ్లి కావలసిన సామానులు కొనుక్కువచ్చుకున్నాడు. వాటితో స్వయంగా, అనుకున్నప్రకారం ఒక రేజర్ తయారుచేశాడు. తన యజమానిసహాయంతో దాన్ని పేటెంట్ చేశాడు. ఇది ౧౯౦౪ లో.

గిల్లెట్టీనోములు ఫలించాయి. కాని అదృష్టదేవత ఇంకా అతనిమీద తన చల్లని చూపు పరపలా.

గిల్లెట్టీ తయారుచేసిన ఆ రేజర్ అప్పట్లో ఎవ్వరికీ నచ్చలా. ఆ చిన్న పరికరాన్ని చూసిన ప్రతివాడూ అతన్నీ, అపరికరాన్నీ అపహాసించటం ఆరంభించారు. తొమ్మిది, పదేళ్లు ఇట్లాగే గడిచాయి.

౧౯౦౧ లో ఒక మెకానిక్ అతనితో కలిసి రేజరును మరింత బాగుపరిచాడు. ఒక కంపెనీ ఏర్పడింది. కాని ౧౯౦౩ వరకూ ఒక్క రేజరుకూడా అమ్ముడుపోలా. గిల్లెట్టీలో నిరాశాభావం ప్రబలింది. ఆపళంగా, తన దగ్గరున్న రేజర్ల నన్నింటినీ పెద్దపెద్ద వాళ్లకు పంచిపెట్టటం ప్రారంభించాడు.

అట్లా ఒకటి జేమ్సులాయిన్ అనే వ్యాపారస్థునికి చేరింది. అతడు దాన్ని ఉపయోగించాడు. అది అతనికి నచ్చింది. వెంటనే కంపెనీలో పన్నెండు వేల పౌన్ల విలువ గల భాగాలు కొనటానికి ఒప్పుకున్నాడు.

అదిమొదలు కొంత అమ్మకం ఆరంభమైంది. అయితే, గిల్లెట్టీ క్రౌన్‌సీళ్లను అమ్ముకుంటూనే ఉండినాడు.

౧౯౦౮ లో ఒక ఉత్సాహవంతుడు- వ్యాపార మర్మాలు బాగా తెలిసినవాడు కంపెనీలో భాగస్థుడయ్యాడు. రేజరును గురించి గొప్పగా ప్రకటనలు చేయటం ఆరంభించాడు.

దాంతో గిల్లెట్టీకీర్తి బయటపడింది. అమ్మకం అద్భుతంగా సాగింది. ఓ! వేలకువేలు ఆదాయం రావటం మొదలైంది. పెయింటరుకూడా కంపెనీలో ఎనిమిదివేల పౌన్ల విలువగల భాగాలు కొని, ఈవిజయానికి విస్తుపోయాడు.

ఆవిధంగా ౪౯ ఏళ్లకు గిల్లెట్టీకలలు ఫలించాయి.

'సత్యశర్మ'

---

## పాల్కురికి

### చిదిరెమఠము వీరభద్రశర్మగారికి ఒక నివేదన

పండితారాధ్యచరిత్ర కర్త పాల్కురికి సోమనాథుని జన్మస్థానమును గురించి తద్గ్రంథ పీఠికారంభములో తగిన ఉపపత్తులను చూపి ప్రసంగిస్తిని. పాల్కురికిలో జన్మించుట చేత సోమనాథుని కాయింటిపేరు కలిగివుండవచ్చునని సూచించి పాల్కురికి గ్రామము నేటి మైసూరు రాష్ట్రములో ఉన్నదనిన్ని, 'కురికి' అనే అంతము గల గ్రామములాంధ్ర కర్ణాటక దేశముల సరిహద్దులలో సాధారణముగా కనిపిస్తున్నవనిన్ని సహేతుకముగా సూచించినాను. దానిపై విమర్శనముగా నా మిత్రులు, పూజ్యులు నైన శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారు కొన్ని వ్యాసములను గోలకొండ పత్రికలోను, విభూతిపత్రికలోను వ్రాసినారు. వారి విమర్శనములోని ముఖ్యాంశము లివి:

(౧) ఓరుగంటికి సమీపములో నున్న 'పాలకుర్తి'యే 'పాలకురికి'. (౨) సోమనాథుడు శుద్ధాంధ్రుడు. కర్ణాటదేశముతో అతనికి సంబంధము లేదు. కాబట్టి పాలకురికిలో- ఆంధ్రకర్ణాటక సీమలు కలియు చోటిలో జన్మించినవాడు కాడు. (౩) సోమనాథుని శిష్యుల యింటిపేర్లుగల కుటుంబములు పాలకుర్తికి సమీపగ్రామములలో ఉన్నవి కాని, పాలకురికికి సమీపములో లేవు. (౪) నేను చెప్పిన గ్రామము 'హాల్‌కురికె' కాని, పాల్కురికి కాదు. (౫) నాది అనంతపురము గనుక సోమన జన్మస్థానమును నాకు దగ్గరగా తెచ్చుకొనడానికి ఈ క్రొత్తవాదమును తెచ్చిపెట్టినాను. (౬) క్రొత్తవాదమును తెచ్చి ప్రసిద్ధిపొందవలెనని అట్లు చేసినాను.

తుది రెండు విషయములకును సమాధానమనవసరము. నాది అఖిలాంధ్రదేశము కాని అనంతపురము కాదు. నాకు దగ్గరగా పాల్కురికి ఉండుటవలన నా కీర్తి హెచ్చేదిలేదు. ఓరుగంటికి దగ్గరగా ఉండడము వల్ల తగ్గేదిలేదు.

'హాల్కురికె' అని కర్ణాటకములో ఆ గ్రామమున కిప్పటి పేరు. ప్రాత కన్నడ శాసనములలో 'పాల్కురికె' అనిన్ని, తెనుగుశాసనములలో 'పాల్కురికి' అనిన్ని ఉన్నది. ఒకప్పు డా గ్రామమునందు తెనుగువా రుండేవారనడాని కనేక నిదర్శనములున్నవి. మైసూరురాష్ట్రములో నాలుగుజిల్లాలలో తెనుగువా రిప్పటికిన్ని ఉన్నారు. కాని, ప్రభుత్వమూలముగాను, విద్యావిధానము మూలముగాను తెనుగు ఆ ప్రాంతములలో అతిశీఘ్రముగా అంతరిస్తున్నది. తెనుగు గ్రామముల పేర్లు కర్ణాటకీకరింప బడుతున్నవి. తెనుగువారు 'పాల్కురికి' అంటే కన్నడులు దానినే 'హాల్కురికె' అంటారు. అట్లే బళ్లారి మైసూరు సరిహద్దులలో కూడాను. కన్నడులు 'చేళ్లకురికె' అంటే తెనుగువాళ్లు 'చేళ్లకురికి' అంటారు. 'చేళ్ల'లోని బహువచన ప్రత్యయమా గ్రామము తొలుత తెనుగువారిదని బోధిస్తుంది. ఇప్పుడు పాల్కురికికి హాల్కురికె అని పేరున్నమాత్రము చేత నా ఊహ కంతరాయము కలుగదు.

పాల్కురికి గ్రామనామవిచారమే క్రొత్తది. ఈవిషయమునుగురించి నాపీఠికలో విస్తరించివ్రాసినాను. నాకు కనబడిన క్రొత్తవిషయమును విజ్ఞుల యెదుట పెట్టినానేకాని, అందువల్ల నాకు కీర్తిరావలెననికాదు. పాలకుర్తియే పాలకురిక్కి అను నిశ్చితవాదమును బయలుదేరదీసినవారు నామిత్రులు బండారు తమ్మయ్యగారు. దానినినమ్మి నిలువబెట్ట ప్రయత్నిస్తున్నవారు శ్రీశర్మగారు. 'పాలకురికి' (పాలకురికె అంటే అనుకోవచ్చును) అనే గ్రామ మొకటి ఉండగా, సోమనాథుడు కర్ణాటకకవిగా కర్ణాటకులచేత పేర్కొనబడుతూ ఉండగా, అది కాదనిన్ని, 'పాలకుర్తి'యే 'పాలకురిక్కి'అనిన్ని స్థాపించడానికి శ్రీ శర్మగారు 'పాలకుర్తి'కి 'పాలకురిక్కి'అనే పేరెప్పుడయినా ఉన్నదేమో ప్రాచీనలిఖితములను చూపుతూ, ఆ 'పాలకుర్తి'కి చుట్టుపట్ల కన్నడము ప్రచారములో ఎన్నడయినా ఉన్నదని నిదర్శనములు చూపవలసిఉన్నది. అట్లు చూపగలిగినా, రెండు పాలకురిక్కిలలోను ఏది సోమనాథుని జన్మస్థానమనేవిషయము సందిగ్ధముగానే ఉండిపోతుంది. ఇంతకంటె ఈవిషయమై వ్రాయవలసినదిలేదు. నాకు జిజ్ఞాసయే ప్రధానముకాని, జిగీష

ప్రేరితుడను కానని వినయపూర్వకముగా మనవిచేసుకొంటున్నాను. శ్రీశర్మగారికి ఒక్కమాటమాత్రము నివేదించుకొనవలెను. నేను వీరశైవుడను కానన్నమాట సత్యమే. అంతమాత్రముచేత వీరశైవసిద్ధాంతముమీద నాకు ప్రీతిలేదనిమాత్ర మనుకోకూడదు. ఎన్నో సిద్ధాంతము లున్నవి. ఏమతమువారి సిద్ధాంతముమీద వారికి పట్టుదల ఎక్కువగా ఉండడము సహజము. శ్లాఘనీయముకూడాను. నాది కావ్యదృష్టి,చరిత్రదృష్టి-అంతే. విమర్శమీద నాకు సత్యమని తోచినదానిని ప్రకటించడానికి జంకను; నేను పొరబడినానని సహేతుకముగా నిరూపిస్తే నాపొరపాటును కప్పిపుచ్చడానికి ప్రయత్నించను.

సోమనాథుని శిష్యుల యిళ్లపేర్లు పాలకుర్తికి సమీపములో ఉన్నకవడము అన్యస్థానవాదమునకు ప్రతిబంధకము కాదు. సోమనాథుడు పాల్కురికిలో జన్మించినా ఆయన ప్రచారమంతా శ్రీశైలప్రాంతము ఓరుగంటిప్రాంతములోనే జరిగినదని వ్రాయనేవ్రాస్తిని గదా.

చిలుకూరి నారాయణరావు.





# విమర్శనము

## ప్రబంధనాయికలు

గ్రంథకర్త: పుట్టపర్తి నారాయణాచార్యులు గారు, తెలుగుపండితులు, మునిసిపల్ హైస్కూలు, ప్రొద్దుటూరు. వెల రూ. ౦-౧౪-౦.

ప్రధానమయిన ఒక నాలుగు తెలుగుప్రబంధములనుండి నలుగురు నాయికలను—గిరిక, సత్యాదేవి, ప్రభావతి, వరూధిని—తీసుకొని, ఆయాప్రబంధములలోని రచనలను స్తనశల్యపరీక్ష చేసి, ఆనాయికల స్వరూపస్వభావాదులను నిర్ణయించినారు నారాయణాచార్యులుగారిందులో. దీనినిగురించి శ్రీ అనంతకృష్ణశర్మగారు పీఠికలో ఇట్లు ప్రస్తావించియున్నారు: "కావ్యనాటకాదులను శాస్త్రీయమగు పారిభాషిక దృష్టితో చూచి తూచుట యొకదారి; దానియందు తెలిసియో, తెలియకయో ప్రతిబింబించిన ఆయాకాలపు సాంఘిక రాజకీయాదివిషయముల నెఱుగ కంటితో మూలముట్టుగ పరిశోధించుట రెండవదారి; ఇవిగాక గ్రంథకర్తయొక్క ఆశలు, అభిమానములు, రాగద్వేషములు మొదలగు జీవనసూత్రములను గమనించి, వానియావిష్కరణపద్ధతులు, అందుచే మన హృదయమందు గలుగు సంవాదవివాదములను బయలుపఱుచుట మూడవది. మొదటి రెండుమార్గములును, ఎంత యుపయోగకరములైనను, సమాస్తాపనికి చేరినవి; విషయసంగ్రహమాత్రమే. మూడవది అనుభవసంగ్రహము; కనుక ఇందులో ధైర్యము, జవాబ్దారీయు ఎక్కువ. ఇట్టి విమర్శము ఒక కావ్యమును విషయీకరించుకొని వ్రాసిన వేరొక కావ్య మనవచ్చును. ఈ 'ప్రబంధనాయికలు' నైతరగతికి చేరిన విమర్శకావ్యము. శ్రీకృష్ణదేవరాయల సాహితీసర్వభూమిని మోచుకొన్న అష్టదిగ్గజములలోని మహత్తరగజములగు పెద్దన, తిమ్మన, సూరన్న, మూర్తి—వీరు సృజించిన నలుగురుప్రధాననాయికల తీర్పును గుతించినది. దానినిగూర్చి యీగ్రంథకర్తయిచ్చిన తీర్మానము కొంతవరకు హేతువాదపు ఫలమైనను ముఖ్యముగా రసవాదము నాశ్రయించినది. ఆయన రుచుల స్వరూపమును ముఖ్యముగా తెల్పును." ఈరచనలో స్వతంత్రమైన భావనాశక్తి వెల్లివిరియుచున్నది. సాహిత్యతత్త్వపరిశీలనకు ఇటువంటి విమర్శలు వలసినంత ఉత్తేజము నొసగగలవు.

---

## దొరబాబు

గ్రంథకర్త: మునిమాణిక్యం నరసింహారావుగారు. ప్రకాశకులు: స్వర్ణలతాగ్రంథమాల, కాకినాడ. వెల ౮ అణాలు.

దీనిలోని మూడుకథలు: దొరబాబు, మా ఆవిడ భక్తి, బద్‌నసీహత్. ఆద్యంతములు రెండును భారతి పాఠకులకు పరిచితపూర్వములే. రెండవది హరనాథబాబా భజనలపైన ఒక మెత్తని విసురు. మూడుకథలును ముచ్చటగా ఉన్నవి. అందులో ఆద్యంతములు ముఖ్యముగా పేర్కొనదగియున్నవి. తమకు సహజసిద్ధమయిన మృదులహాస్యమును నరసింహారావుగారు వానిలో ఒలికించినారు.

---

## కమలాంకథలు

గ్రంథకర్త: యలమర్తి రామమోహనరావుగారు. ప్రకాశకులు: స్వర్ణలతాగ్రంథమాల, కాకినాడ. వెల ౮ అణాలు.

చిన్న చిన్నవి ఎనిమిది కథలిందులో ఉన్నవి. కాంతంకథల ధోరణిలో వ్రాయవలెనని గ్రంథకర్త ప్రయత్నము. ఆ వరవడి నందుకొనుటకు వీరి కింకను చాల పరిశ్రమ అవసరమయియున్నది. ఇందులోవి అన్నియూ చాల సామాన్యమైన కథలు. విశిష్టత బొత్తిగా కానరాదు.

---

## ౧. అమరుకము

అనువాదకుడు: వింజమూరి శివరామరావుగారు. ప్రకాశకులు: నవ్యసాహిత్యపరిషత్తు, గుంటూరు.

## ౨. అమరుకము

అనువాదకుడు: పెనుమర్తి వెంకటేశ్వరశాస్త్రిగారు, సంస్కృతకళాశాల, తెనాలి.

## ౩. అమరుకము

అనువాదకుడు: ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారు, కూచిపూడి. ప్రకాశకులు: నవ్యసాహిత్యపరిషత్తు, గుంటూరు.

అమరుకకావ్యమునకు ఇదివరకే పోలెడన్ని అనువాదములు తెలుగులో ఉన్నవి. ఇప్పు డొక్కసారిగా మరి మూడు అనువాదములు వచ్చినవి. ఒక్కసారిగా ముగ్గురు రచయితలకు దీనిపైన మోజు కలుగుట విశేషమే. కూడబలుకుకొని, పరీక్షకు పెట్టినట్టుగా మూడును ఒక్కసారిగా బయలుదేరినవి. ఇందులో ఒకటి (పెనుమర్తివారిది) 'మురారే స్తృతీయఃపంథా' యని నలుగురినోట నానని మరియొక పేరు పెట్టుకొన్నది. జమ్ములమడక మాధవరామశర్మగారు ఆ పేరుకూడ సంగతమైనదే యని చెప్పుచున్నారు. అయినను అది చెవికిమాత్రము కటువుగానే యున్నది. పైపెచ్చు, మరియొక అర్థమునకుగూడ అది వాచకమై యున్నది. అస్తు. రచనలోను, శైలిలోను, భావములోను ఇవి మూడును మూడుదారులు త్రొక్కినవి. శివరామంగారి రచన ద్రాక్షాపాకము; పెనుమర్తివారి రచన కదళీపాకము; ఘట్టివారి రచన నారికేళపాకము. మొదటిదానిలో నున్నంత సారళ్యము తక్కిన రెంటిలో మృగ్యము. అవి రెండును ప్రౌఢరచనలు. కాని, మూడును మూలానుసరణలో మాత్రము ఏకీభవించుచున్నవి. అమరుకకావ్యగౌరవమును చాటుటకు బయలుదేరిన ఈగ్రంథత్రయమును కవిపండితలోకము యథోచితముగా ఆదరించునని నమ్ముచున్నాము.

---

## సోవియట్ రష్యా

రచయిత: జవహరలాలు నెహ్రూగారు. అనువాదకుడు: పండితారాధ్యుల నాగేశ్వరరావుగారు. ప్రకాశకులు: సంస్కృతిగ్రంథమండలి, వంగల్ బిల్డింగ్స్, పెరంబూరు, మద్రాసు. వెల ౧౨ అణాలు.

౧౯౨౭ నాటి సోవియట్ రష్యా స్థితిగతులను, స్వయముగా చూచివచ్చి, నెహ్రూగారీగ్రంథమునందు సాకల్యముగా వివరించినారు. "సోవియట్ల ఈనాటి జీవితమును చిత్రింపకున్నను ౧౩ ఏండ్లనాటి సోవియట్ రష్యాను ఈనాటి సోవియట్లతో పోల్చిచూచుటకును, సోవియట్ల మహత్తరసాధనను, అభివృద్ధిని గ్రహించుటకును ఈగ్రంథ మెంతో తోడ్పడగలదు." అనువాదము మూలానుసారిగా ఉండి, సరళముగాను, ధారావాహిగాను ఉన్నది. ముద్రణస్ఖాలిత్యములు లేకుండ, ప్రకాశకులు, మరికొంత శ్రద్ధవహించియుండినచో పుస్తకము నిష్కళంకముగా నుండియుండును.

---

## పువ్వు

గ్రంథకర్త: బూరాడ సుబ్బేశ్వరశాస్త్రిగారు, తెలుగుపండితులు, బి. హెచ్. ఇ. స్కూలు, బారువ, విశాఖపట్టణముజిల్లా. చిన్న పద్యకావ్యము.

---

## ఆరామము

గ్రంథకర్త: బంకుపల్లి రామజోగారావుగారు, వాడాడ, శ్రీకాకుళముతాలూకా. ఇంచుమించు ముప్పది ఖండకృతుల సముచ్చయము. చిన్న పుస్తకము. ఈరచనలలో కొన్నిట చక్కని రీతి, మాధుర్యము గోచరించుచున్నవి.

---

## రాష్ట్రగీత

రచయిత: చదలవాడ కోటి నరసింహముగారు, పరసతాళ్లూరు, సత్తెనపల్లితాలూకా, గుంటూరుజిల్లా.

ఇది ఒక చిన్న ప్రబోధకావ్యము. మంజరీ చ్ఛందస్సులో నిబద్ధమయినది. సంఘములోని నేటి స్థితిగతులను సంస్కరించుటకై యుద్దేశింపబడినది.

---

## కుముదం, లేక మాబావ

రచయిత: సోమయాజుల వెంకటరామమూర్తి గారు, హెడ్‌మాష్టరు, సిటీహైస్కూలు, బరహంపురము. నవ్యసాహిత్యపరిషత్తు నవమవార్షికోత్సవ సంపుటమునుండి పునర్ముద్రితము.

ఇది ఒక చిన్న ప్రహసనము. హాస్యమే ప్రధానముగా గలిగినది. ఇతరవిషయములందు రచయిత అంతగా పట్టింపు పెట్టుకోలేదు.

---

## ధర్మజ్యోతి

రచయిత: తుమ్మల సీతారామమూర్తిచౌదరి గారు, పండితులు, బోర్డుహైస్కూలు, పొన్నూరు, గుంటూరుజిల్లా. వెల ౨ అణాలు.

సీతారామమూర్తిచౌదరిగారి తండ్రి తుమ్మల నారయ్యగారు. వారి జీవిత మొక ధర్మజ్యోతి. "నమ్మినవారిని చెరుపమి, దమ్మిడికేని పరులసొత్తు దాకమి" యను వరధర్మములను పరమార్థములుగా పెట్టుకొని ఆయన జీవితము సాగించినాడు. ఆయన జీవితములో ఒక ముఖ్యఘట్టము 'కోమటి-పసిడియచ్చులు.' నమ్మి దాచమంచిన పసిడియచ్చులను ఏండ్లతరబడిగా కాపాడి, మరల వాయిచ్చినతనికి నమ్మకముగా నిచ్చివేసిన ఆ ధర్మగాథను సీతారామమూర్తిగారు ఈపద్యకావ్యమునందు కూర్చినారు. రచన మధురముగా నున్నది. చక్కని భావములో, ధారాళమైన శైలిలో నున్నది.



Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.